# తూలిక



వ్యాసకుటీరము,
మెలుపాక - ఎలమంచిలి
(విశాఖపట్నము జిల్లా.)

# తూలిక

---

ముద్దా విశ్వనాథము

కవితాసమితి.

---

వ్యాసకుటీరము

మొలుపాక.

*

*     *



*     *

*

# ధన్య జీవులు

ఒకప్పుడొక గ్రామమున రాములు అను నొక కర్షకుండు నివసించుచుండెను. రాములుకు వివాహమైన తరువాత అతని తండ్రి దివి కేగెను. నాయన పోవుసరికి పిత్రార్జిత మస్తే లేదు. సుమారు ఇరువది మేకలు గల చిన్నమంద, పాడిపసువులు రెండు; ఇదియే అతని కుండిన యాస్తి యంతయును. రాములు దూబరాదిండి గాక ఉన్నఆస్తి ఊడిపోకుండ సంసారకాలక్షేపము చక్కగ చేయుచు మెలకువతో మెలగుచుండినందున, పూర్వులు విడిచిపెట్టి వెళ్ళిన దానికి కొన్నాళ్ళు అభివృద్ధి కాజొచ్చినది. రాములుది పాటుపడి న్యాయముగ ఆర్జించు సుస్వభావము; అంతేకాని అయాచితముగ ధనము వచ్చి పడినదిగదా యని అతడు దుష్కృత్యములలో ప్రవేశింపలేదు. ఈతని భార్యకూడ పతిమాట మీదనే నడచుచు, అడుగు తప్పక అతనిని అనుగమించు గుణవంతురాలు. ఉభయులును ఉదయముననే అందరి

కంటె ముందుగ పనిలోనికి పోవుదురు, సాయంకాలము ఎల్లరకును వెనుక ఇలు సేరుచుందురు. న్యాయవర్తనులై శ్రమపడుట గని, ఆదంపతులను పరమేశ్వరుఁడు మెచ్చినాఁడు, ఇందులకు ఫలముగా లక్ష్మి వరించి వారి యింట కాలు పెట్టినది. ఇట్లు రాములు ముప్పదైదేండ్లు కష్టపడి వేలకు అధిపతి యైనాఁడు.

ఇఁక ప్రస్తుతము—పాఁడి పశువులు మూఁడు నందలు ! మునుపటి ఇరువది మేఁకలును ఇపుడు ఇరువది నందలయినవి ! పసులను మేఁకలను మేపుచు ఆగ్రామపు గొల్లలందఱును తనచేతిక్రింది సేవకులైనారు. ఊరి పడఁతులు పాలు పెరుఁగు వెన్న మొదలగునవి తయారు చేయుటకు నియుక్తులైరి. ఇంతయేల ? అతనికి గురుఁడు పదునొకండవ యింటిలో నుండుటచే అతఁడు పట్టినదెల్ల పసిఁడియు ముట్టినదెల్ల ముత్యమును అగుచుండెననుట అతిశయోక్తి కాదు. ఇట్టి మహోత్కృష్టదశలో సహాజముగ లోకమే అతనిపేరు "రామస్వామి" గా మార్చినది. సిరిసంపదలు అభివృద్ధియైనకొలఁదియు నామధేయము కూడ గౌరవసూచకముగా "రామస్వామి నాయఁ" డని పొడిగింపఁబడినది.

# ధ న్య జీ వు లు

'ఆహా ! అదృష్టమనిన ఇట్టిదికదా !' అనుచు లోకము అతని ననేకభంగుల మెచ్చుకొనుచు నోటి కొలది పొగడినది. పలుతావులనుండి పలుకుబడి గల వారు అప్పు తీసికొనుటకై ఇటకు వచ్చుచుండిరి. డబ్బు తోడనే పుట్టినారు అసంఖ్యాకులైన ఆశ్రితులు ! కీర్తి కాంత ఇతని పేరు మున్నెపుడును కనివిని యెఱుగని దూరప్రదేశములకు గొంపోయి పరిచితవర్గమును పిక్కటిలఁ జేయుచుండెను. వారెల్లరును ఇతని యింట విడిసినపుడెల్ల వలదని బెట్టు చేయుచున్నను బలవంతపెట్టి పొట్ట లుబుకునట్లు తినుపుట తప్పెడిది గాదు. ఇంటికెంతమంది క్రొత్త క్రొత్త అతిథులు వచ్చినను భోజనాదికములు సదా సిద్ధముగ నుండును. కొంచెము పేరొందిన పెద్దమనుష్యుఁడు వచ్చెనేని ఒకటో రెండో కోళ్లు—అతిథులు అంతకు మించినచో అదనముగా మేకలు—వారి విందులకై వినియోగపడుట తప్పదు.

రామస్వామినాయనికి ఇద్దఱు పుత్రులు ఒక పుత్రియును; ముగ్గురు వివాహితులే. ఈయన "రాములు" గా నుండిన పూర్వదశలో, కొడుకులు సొమ్ములను మేకలను కాచుచు అలసతమాని తండ్రి

తో పాటు పాటుపడుచుండిరి. ఇపు డట్టి అవసరము లేదు. చేతిలో పుష్కలముగ ధనమున్నందున ఇరువురును చెడు సాంగత్యముచేసి దుష్టబుద్ధులుగ మారిరి. అం దొకడు మద్యపానము మరగినాడు. జ్యేష్ఠుడు ఒక దొమ్మిలో చావుదెబ్బలు తిని మడిసినాడు. పిన్న వాడు కులముతక్కువ కన్నెను కట్టుకొని తండ్రి మాట తిరస్కరించి అతనిపై కత్తికట్టి ఆస్తిలోని తన వాతు తనకు తెమ్మని తెగఁగొట్టి పంచుకొని ఎక్క డికో వెడలిపోయినాడు.

ఈ యవస్థ ఇటుండ, దొమ్మ రోగము వచ్చి పశువులు మేఁకలును చాలవఱకు నాశమునందినవి. దెబ్బమీఁద దెబ్బ అన్నటులు, పంటలు తుడిచిపెట్టుకొని పోయి ఆవత్సరమే కాటకము ప్రారంభమయినది. కాకులనఁ దగిన లోకులమెప్పు వడయుచుండిన రామ స్వామి నాయఁడుగారి దివ్య వైభవము శిథిలముగాఁ జొచ్చినది.

స్థితిగతులు క్రుంగుటతో పాటు శరీర పాటవ మును తగ్గినది. డెబ్బదేండ్ల ముసలియై, దివాలాతీసిన నాయఁడుగారిని తిరుగ 'రాములూ' అను అతని చిన్న

నాఁటి చిన్నపేరనే అందఱును పిలుచుచు వచ్చిరి. నడుమంత్రపు సిరిలో లభించిన సాలువులు, కోటులు, మొదలగునవన్నియు విక్రయించి జీవనము నిలుపుకొను గతి పట్టినది. అమ్మివేయఁగా మిగిలిన యొక్క మేకఁనుగూడ అమ్మివైచి, రాములును భార్యయు పొట్టకూటికై ఒకరిమొగము లొకరు చూచుకోవలసినవారైరి. ఇట్లు పాపము ! వచ్చిన విత్తాదివైభవములు వచ్చినదారినే వెళ్ళి పోయినవి. చంచలచిత్తయగు లక్ష్మి చెప్పకుండనే అతనికి చిప్ప చేతికిచ్చి మటుమాయమైనది. మిగిలియున్నదెల్ల తెక్కలకష్టమే ! కట్టుబట్టలును కట్టుకొనిన భార్యయును దక్క దగ్గఱ నేమియునులేదు. పోనీ, వెనుక ఆసరా ఉన్నదేమోయనిన, ఆమాత్రమయిన అనుగ్రహింపలే, దా మాయదేవుఁడు. ఉన్న ఒక్క కూఁతురును జవ్వనము చూడకయే పెద్దలఁ జేరుటచే, ఆ వృద్ధదంపతులు దిక్కులేని పక్షులైరి.

రాము లింటి పొరుగుననే అబ్దుల్లా అను నొక ముసల్మాను గృహస్థు నివసించుచుండెను. దయాదాక్షిణ్యము లతనికి ఉగ్గుపాలతోఁ బెట్టిన సహజగుణములు. తన్నర్థించువారిని నోటితో లేదనకుండ చేతితో లేదని

చెప్పి పనుపఁగల్గిన సామాన్య స్థితిమంతుఁడు. ఉన్నమట్టునకు అప్పులేని నికరమైన ఆస్తి. నలుగురిలోను "ఆహా" యని అనిపించుకొన్న సఫలీకృతమైన జన్మము ! ఉల్లితోఁటలో మల్లియవలె వ్యవహరించుచున్న గుణరాశియగు ఈ తురకబిడ్డ బ్రతికి చెడిన రాములను ఉపేక్షించునని మన మనుకొను టెట్టులు ! ఉచ్చదశలో నున్నప్పటి రాముల అతిథిపూజానిరతి మఱవరానిదై యుండి, ఎంతలో నెట్లు మాఱినదో యని రాముల దుస్థితికి వగచి, అబ్బుల్లా ఒకనాఁ డతని నిట్లోదార్చెను:

రాములూ ! కాలగతి ఏరికిని ఒక్క తీరున నుండుట కష్టముకదా ! గతమునకు వగచిన లాభమేమి ? ముందుకథ చూచుకొనుట కర్తవ్యము, వివేకలక్షణము. ఇటు చూడుము. నీవు నీ భార్యతోఁగూడ వచ్చి నాయొద్ద నుండుము. పాలికాపుఁలు సరిగ పని చేయునట్లు చూచుచుండుము. ఖులాసాగా నున్నపుడు నీవే పాలు తీయుము. ఇతర సమయముల దగ్గరనుండి పిదికింపుము. ఇఁక నీభార్య చిన్న చిన్న పనులు చక్కఁబెట్టుచు ఇంటిలో ఆసరాగా నుండఁగలదు. అల్లా ప్రసాదించినంతమట్టునకు మాతోపాటు మీరును కలిసియో

గంజియో త్రాగి జీవిత శేషము వెళ్ళఁబుచ్చుకొన వచ్చును. దైనముఖము చూచి వీలగునంతవఱకు మీ కే లోటును లేకుండఁ జూచెదను.

ఈ యభయమునకు రాములు వందనపూర్వకముగ 'వల్లె' యని సతీసమేతముగ క్రొత్త కొలువులో ప్రవేశించెను. ఒడలు వంచుట మఱచి చిరకాలమైనందున రాములకు పనిచేయుట మొదట కొంచెము కష్టమనిపించినది. కాని, చేసియున్న చేయి కనుక క్రమశముగ ఇంటిబాధ్యత యంతయు పూర్తిగ వహించి నిర్వహించుచుండెను.

ఆవధి యెఱుఁగక విశ్వాసముతో పరిశ్రమ చేయుచున్న ఆ వృద్ధ దంపతుల విలువ అబ్దుల్లాకు విశదమైనది. ఒక పని చెప్పించుకొనుటగాని ఒక మాట అనిపించుకొనుటగాని ఎన్నఁడును లేదు. ఏ క్షణమున వారీయింటఁ గాలుపెట్టిరో అప్పటినుండియు నది స్వగృహమువలెనే చూచుకొనుచు, నిమిషమేని వ్యర్థపఱుపక వేయి కన్నులతో కనుపెట్టుకొని యుండిరి. ఇట్టి న్యాయశీలురఁ జూచి అబ్దుల్లా "ఆహా దైవమా ! ఎట్టి సజ్జనుల కెట్టి గతి పట్టినది ! అనుకొనుచు జాలిపడి వారిని గుఱించి తఱచు ఖేదమందుచుండెడివాఁడు.

ఇట్లుండఁగా —

ఒక దినమున అబ్దుల్లా గృహమునకు దూర ప్రదేశమునుండి కొంద అతిథులు వచ్చిరి. అందు ఒకా యన 'ముల్లా'. నాఁడు మేఁకమాంసము వండింపుమని రాములకు అబ్దుల్లా ఆజ్ఞ ఇచ్చియుండెను. రాములు అతి శ్రద్ధతో వంటకముల తయారు చేయించి విందు సిద్ధము చేసేఁనాడు. అబ్దుల్లాతో కూడ అతిథివర్గము మెత్తని పరుపులపైనను తివాసులపైనను ఆసీనులై విందారగించిరి. వారు చివర తేనీటిని గ్రోలు సమయ మున రాములు వారికి తమాకు సిద్ధము చేయుటకు ప్రక్కద్వారము నుండి పోయెను.

అబ్దుల్లా అతనిని వ్రేలిడిచూపి ముల్లాతో :—

ఆవెళ్ళుచున్న వృద్ధుని చూచితిరా ?

ముల్లా:— అవును, ఏమి ?

అబ్దుల్లా:—ఒకప్పు డితఁడు మా ప్రాంతము లలో తులలేని వైభవముతో తులతూఁగినవాఁడు. ఈ తఁడే రామస్వామినాయఁడు. బహుశః ఈపేరు తమరు వినియే యుందురు.

ముల్లా:— ఓహో, ఔనౌను, ఈయనను గుఱించి చెప్పుకొనుటయే కాని ఇంతవఱకు చూచి యుండలేను.

అబ్దుల్లా:— పాపము ! ఇప్పుడు ఎట్టిని యే గాని చేతలేని అసహాయుఁడైనాఁడు. నాయొద్దనే పెద్ద పాలికాఁపుగా పని చేయుచున్నాఁడు. ఇతని భార్యకూడ ఇటనే పని చేయును.

ముల్లా విస్మితుఁడై నాలుక కఱచుకొని తల పూకించినాఁడు. 'ఆహా కాలచక్రము ! ఓడలు బండ్లు, బండ్లు ఓడలు అగునను లోకోక్తి ఇట ప్రత్యక్షానుభూతమయినదే ! ఫకీరును ఫాదుషాగాను ఫాదుషాను ఫకీరుగాను చిటికలో చేయఁగలదు కాలము. ఈ దైన్యావస్థకు ఆ ముసలి యతఁ డెంత క్రుంగిపోయి కుంగుచున్నాఁడో ఊహింప శక్యమా !' అని సానుభూతి కనఁబఱిచెను.

అబ్దుల్లా:— ఏ నిమిషమున కెవని కే పాటు వచ్చునో ఎవరి కెఱుక ? కాని, ఈ వార్ధకములోఁగూడ అతఁడు చిద్విలాసముగనే యుండును, చిఱచిఱలాడి యెఱుఁగఁడు. సంతత క్షమాసంపత్తియే కాని, ఎన్నఁడును

కొంటకొంట లాకుట కొఱకము. అవధి ఎఱుఁగని పరిశ్రమ మే కాని అలసత అతని జన్మములోనే లేదు.

ముల్లా:-అతనితో ప్రసంగింపవలెనని యున్నది. అతని జీవితముగూర్చి అతనిని నేను ప్రశ్నింపవచ్చునా ?

అబ్దుల్లా:—అయ్యో, అభ్యంతరమేమి ? — అని చప్పట చఱచి రాములును పిలిచి—"కొంచెము తేనీరు తీసికొందువుగాని రమ్ము, అవ్వను కూడ రమ్మ నుము" అని చెప్పెను.

రాములు వచ్చి యజమానునికి సలాముపెట్టి ఒకచో ఆసీనుఁడైనాఁడు. అతని పెండ్లము యజమాను రాలితోకూడ తెరచాటున నుండెను. రాములు తేనీరు గ్రోలినపిమ్మట—

ముల్లా:—తాతా ! మిమ్ములఁ జూచినపుడు నీ పూర్వవైభవము స్మృతికి వచ్చి వ్యసనపడుచుందువు కాఁబోలు పాపము ! అపుడు లక్షల కధికారివి, ఇపుడు-

(మందహాసముతో) రాములు:—ఇప్పటి నా సుఖదుఃఖములఁగూర్చి నేనే చెప్పకొన్నచో మీరు నమ్మరు. అదిగో అక్కడనున్న మా యింటిదాని నడుగుఁడు. ఆఁడుది, అందుచే సహజముగ 'నోటిలో నువ్వు

గాజ దాఁగను.' లోననున్నదెల్ల నిష్కపటముగాఁ జెప్పఁగలదు.

(తెరవైపు తిరిగి) ముల్లా:— అవ్వా ! మీ జీవితపు పూర్వప్రకృత స్థితుల బాగోగు లేమో నీయభిప్రాయము మాకు తెలియఁ జెప్పుము. వినుట కెంతయు నుత్తలపడుచున్నాము.

అంతలకు ముసలిది తెరచాటునుండి యిట్లు పల్కెను:— అయ్యా ! నేనును నా భర్తయు—ఒకటి కాదు, రెండు కాదు—ఏబది వర్షములనుండి సౌఖ్యాన్వేషణమున వ్యగ్రహృదయులమై వ్యవహరించితిమి. కాని ఎందును అది కానమైతిమి. ఎవరికొఱకు మే మిన్ని నాళ్ళు పరితపించితిమో ఆ 'సౌఖ్యదేవత'—కాయకష్టములచే కాలము గడపుచున్న మా ఇప్పటి స్థితిలో ప్రసన్న మైనది. ఇంతకంటె మాకు వలయున దేమి !

ఇది విని అతిథు లాశ్చర్యభరితు లయిరి.

అవ్వ:— నేను చెప్పిన దంతయు నిశ్చయమే కాని పరిహాసము కాదు, నమ్ముఁడు. ఏఁబది వత్సరములు ఆనందముకొఱకు ప్రాఁకు లాడితిమి కాని, నాల్గు ఱాళ్ళు చేత ఆడుచున్నంత కాలము, సౌఖ్యదేవత మాకు

సందర్శన మిచ్చినదికాదు. క్షణభంగురమగు హిరణ్యము హరించుట తోడనే రాజమార్గ మవలంబించి సేవాదీక్షఁ బూని, రాజులకుఁ గూడ లభింపని ఆనంద సామ్రాజ్యము ననుభవింపఁగల అదృష్టవంతుల మైతిమి.

అబ్దుల్లా:— అయినచో నిజమగు సౌఖ్యము ఎటనున్న దందువు ?

అవ్వ:— మనవి చేసెద, నాలింపుఁడు: సంపద సమృద్ధముగా నుండిన 'అప్పుడు' ఒక్క క్షణమయిన మాకు మనశ్శాంతి లేదు. ఉభయులము తిన్నగా మాటాడు కొనుటకైన, ఆత్మవిచారణమున కయిన, ఈశ్వర చింతనమునకైన అవకాశము లేకపోయెను. అబ్బ ! ఎంత వ్యాకులత, ఎంత చింత ! ఇది యటుంచి—మేఁకలను ఏ నక్కయయిన ఏ తోఁడేలయినఁ దీసికొనిపోవునేమో, పసువులను దొంగలు తోలుకొని పోదు రేమో, అను భీతి యొకటి. రాత్రిపూఁట కంటిమీఁద కునుకు లేక తోఁటల వెంబడిని దొడ్ల చుట్టును గస్తు తిరుగుచుందుము. అన్నియు అమరిన వనుకొన్నంతలో వర్షాకాలమునకు తగినంత గ్రాసము పసువులకు కావలెనని ఒక పాలికాఁపు వచ్చి చెప్పును. ఇన్నిటికంటె ముఖ్యముగ—మా దంపతులలో

మాకు మాటపొందిక కుదురకుండెడిది. ఒకపని ఆయన చేయుమని చెప్పును, అది పనికిరాదని నే నెదురాడి చికాకుపరచుచుండును. ఇవ్విధమున తాపత్రయములలోఁ దగుల్కొని పాపముల పెంపొందించుకొనుచు, నిత్యా నందము నరయఁజాలక జీవితములు వ్యర్థముగ గడపితిమి.

అబ్దుల్లా:— మఱి ఇప్పుడో ?

అవ్వ:— ఇప్పుడా ! ఉదయముననే లేచి ఉభయులము ప్రశాంతముగా ప్రేమపూర్వకముగా ప్రసంగించుకొందుము. ఉన్నదెల్ల ఒక్క యజమానుని సేవాచింతనము తక్క ఇతర విచారము లెవ్వియు లేవు. ఆలుమగలలో అభిప్రాయభేదములు కల్పించు అనవసరపు గొడవలి పు డేమియు లేవు. యథాశక్తి యజమానుని సేవ చేసికొని, మావలన ఆయన కొక కాని కలసివచ్చునట్లు కష్టపడుటయే మా నిరంత రోద్యమము. నాభర్త పొలము పని చూచుకొని వచ్చుసరికి భోజనము సిద్ధముగ నుండును. చలికాలములో కప్పుకొనుటకు దయతో అనుగ్రహించిన వస్త్రులు దుప్పటములు ఉన్నవి. దైవస్మరణకు ఆముష్మికచింతకు ఎంతో వ్యవధి కలుగుచున్నది. ఏబ దేండ్లు ఎడతెగక సౌఖ్య మన్వేషించి, తుదకు ఇప్పుడే చరమదశలో దానిఁ గనుగొనఁ గల్గితిమి !

మంతయు ఆనందాబ్ధిలో మునిఁగి శ్రమ పాటింపక పాటు పడుచుండిరి.

ఆనాఁటి ప్రాతః కాలమున మనోహరమగు ధాన్యపు కుప్పలు నీ రెండలో నిగనిగ మెఱయుచు, ఒక విధమైన వింత సౌరభము వెదచల్లుచుండెను. పటేలు తన పరిస్థితులు నెమరునకు తెచ్చుకొని పర్యాలోచనములోఁ బడెను. ధాన్యపు కుప్పల మీఁదనే తన కన్ను పడినది. కన్ను పడుట యేమి, అతని హృదయమున ఆశాపిశాచము ఆవహించుట యేమి ? 'అయ్యో ! కష్టపడినది మేము ! ఱెక్కలు ముక్కలగు నటులు కష్టపడినది మేము. ఈ కుప్పలు—ఈ ధాన్యపుకుప్ప లన్నియు — ఎండయనక వానయనక, మధ్యాహ్నమనక ముచ్చు ప్రొద్దనక, ఇపు డనక అపుడనక—పసిబిడ్డలును పడుచువాండ్రును చెమ టోడ్చి పండించిన పంట ! ఇట్టి పంటలో—రవంతయైన, చీపురుముల్లంతయైన, శ్రమయనునది లేకయే, జమీం దారు తన భాగము కబళించుకొని పోవును కద !' అను మనోవేదన కల్గినది. కొంత సే పాఁగి, తన పెద్దకన్నులను ఇంకొకమాఱు కుప్పలపై నిలిపెను. నిలిపి, చిత్తములోని నష్టబుద్ధి ప్రోద్బలముచే నతఁడు మరల నిట్లు తలఁ

చెను:—'కుప్పనుండి ఒక్క బండెఁడు పంట లాగివేయఁ గలిగితినా.........!'

౨.

రాత్రి రెండు జాములు దాఁటినది, ఊరు మాటు మణఁగినది. పటేలు తన సోదరుని ఒక పరిచారకుని వెంటఁగొని వచ్చి, వారి సాయమున బండి నిండ పంట యెక్కించెను. భోజనము లభించిన దనఁ గనే పొట్ట అరువు తెచ్చుకొను ఘస్మర బ్రాహ్మణుని పగిది, పటేలు బండికి తగని బరువు వేసి దట్టించి నాఁడు. బండి ఇంటికి బయలు దేఱినది. నవుకరు సారథ్యము వహింప, పటేలుగారు ముందును, సోదరుఁడు వెనుకను నడచి పోవుచుండిరి.

ఊరి సరిహద్దు చేరుసరికి, ఇరుసు స్థానము తప్పి చక్రములు తిరుగక ఆఁగిపోయినవి. పటేలు తన సహచరుల సాహాయ్యముతో బండి బాగుచేయుదమని తన యావచ్ఛక్తితో యత్నించినాఁడు; కాని, భారమతీత మగుటచే సాధ్యము కాక పోయినది. పాపము ! పటేలునకు గట్టిచిక్కు తటస్థించినది. ఎవరినైన సాయ

ముసకు పిలిచిన రహస్యము బయలు పడవచ్చును. ముం ముందునకు గాని వెనుకకు గాని అడుగిడుటకు వీలు లేకుండెను. పోనీ ధాన్యము నచట దిగవిడిచిపోవుద మన్నను అదియు అలవికాని పనియే. ఏమిచేయుటకును తోఁపదాయె. కాలయాపన మైన కొలఁదియు, తాను చేసినది తప్పు మనస్సునే కోఁతలు కోయుచుండెను. ఉన్నవాఁ డున్నట్టుగనే పట్టునడి పోవునే మోయను భీతి ఆవహిల్లినది. లోకనిందకు పాల్పడ వలసెఁగదా యని శరీరము కంపించెను. అట్టి విషమావస్థలో పటేలు, దారిపోవు అపరిచితవ్యక్తి ఎవరైన ఎదురుపడినచో బాగుగ నుండును గదా యని యోచించుచుండెను.

గజాభాయి గోహిల్ ఒక సామాన్య జమీందారుఁడు. అతఁడు మామూలు చొప్పున లోటా చేత పుచ్చుకొని ఆహ్నికములు తీర్చుకొనుటకై ప్రాతః కాలముననే బయలుదేఱెను. చలి మిక్కుటముగ నుండి నందున కన్నులు మాత్రము కనఁబడులాగున ఒడ లంతయు కప్పివేసికొనెను. డోలాందోళితచిత్తుఁడయిన పటేలు అతనిని చూచి 'ఈ పథికుఁడు మనగుట్టు తెలియనేరఁడు' అని యూహించెను. జమీందారు చేరు

వరకు రాగానే బండిని సరిచేయుటకు కొంచెము తోడ్పడు మని పక్షులు కోరెను. ముఖముపైని ముసుగుండుట వలన ఆ చీకటిలోను ఆ కంగారులోను పక్షులు, జమీందారు నానవాలు పట్టలేకపోయెను. కాని కుశాగ్ర బుద్ధి కలిగిన జమీందారు, తన పక్షులను తక్షణమే గుర్తించెను. తన చిరానుభవమువలన, జరుగుచున్న రహస్యమును వెంటనే గమనించెను. ఇది చూచి జమీందా రిట్లు యోజించెను:—

'సిస్తు తప్పించుకొనుటకై ఈ పక్షులు పంట నింటికి చేర్చుకొనుచున్నారు. నన్ను గుఱుతు పట్టినచో నతనికి విషాదావస్థ ప్రాప్తించును. జాగోవంటి మర్యాదస్థుడు అవమానము భరింపజాలక ఆత్మహత్యకుఁ గూడ వెనుదీయడు.'

ఈ యుద్దేశముతో జమీందారు, తన్ను తెలిసికొనలేకుండునట్లు తల వంచుకొని తగిన సాయ మొనరించెను. పక్షులు అమితోత్సాహముతో బాగు పడిన బండి నింటికి తోలుకొని పోయెను. జమీందారు కూడ ఇంటికి మరలుచు, ఇట్లను కొనెను:—

'పోనీ, ఏమి పోయినది ? పాపము ! వారు నిద్రాహారములు లేక నిత్యము పాటు పడుదురు. కొంచెము తీసికొని పోయిరేని నేనేల చింతింప వలెను ? ఇంతకును వారు నా రైతులు—నా బిడ్డలు !'

3.

ఆఱు నెలలు కడచినవి. ఈ గాథ ఇంచుమించు విస్మృతిలోఁ బడినది. ఇది యిటులుండ —

ఒకనాఁడు గజాభాయి గారి గృహమునకు పెక్కు రతిథులు వచ్చిరి. నవుకరు ఒకటి రెండు పఱుపులు మంచములు అడుగుటకు పటేలింటికి వెళ్ళెను. అతఁ డిచ్చుటకు సమ్మతింప కుండెను. ఇందుల కలిగి నవుకరతనిని తూలనాడెను. పటేలునకు ఒడలుడికి 'ఇట్టి దొరల కొలువులో నేనుండఁజాల' నని పల్కెను. ఈ మాటకు దురహంకారుఁడగు నవుకరు మండిపడుచు 'నిన్నెవ రిటఁ గట్టిపెట్టిరి ? మఱొక చోటికి పోలేక పోయితివా?' అనుచు కసరి కొట్టెను.

పటేలునకు అగ్నిపైని గుగ్గిలము పడినట్లయి అన్నంతయు అక్షరశః ఆచరించుట కతఁడు దృఢనిశ్చ

యుఁడై, ఊరు వదలి పోవుటకు సన్నద్ధుఁడయ్యెను. యజమానునకు ఈ గొడవ ఇసుమంతయు తెలియదు. మఱునాఁడు పటేలు సామాను బండ్లతోడను సంసారము తోడను యజమానుని గుమ్మము ముందఱనుండియే పోసాగెను. నిష్కపటులగు పురజను లతనిని పోవలదని పోరిన కొలఁదియు, అతఁడు మఱింత భీష్మించుచుండెను. ఈ యుదంత మంతయు యజమానుని చెవిని బడి, ఆయన స్వయముగ వచ్చి పటేలును సముదాయింతమని సంకల్పించి, అంత సాహసమునకు కతంబేమని అడిగెను.

'మేము కష్టించి సంపాదించిన దంతయు తమకే సమర్పించు చున్నాము. ఈ శీతకాలము నందునైతము మాకు చినిఁగిన పఱపులును కుక్కిమంచములే గతి. అయినను మీ పరిచారకుఁడు మమ్ము పీడించుట మానలేదు. మా కది భరింప శక్యము కాకున్నది.' అని పటేలు తన పట్టరాని హృదయవేదన లార్చెను.

యజమానుఁడు ప్రశాంతచిత్తముతో పరిస్థితులెల్ల గ్రహించెను. తులువయగు తన నౌకరు వాచా

దోషమునకు చిక్కిలి వ్యధచెంది, వానిని తగురీతిని మందలించెను.

మఱియు పటేలుతో, 'అయినదేదో అయినది. గతము మఱచి ఇంటికి మరలుము' అని బోధించెను. కాని ఆ మృదువచనములు పటేలు సంకల్పమును నివర్తింపఁ జాలకపోయెను; అతని మనసు మరల్చుట అసాధ్యముగ అగపడినది.

అంతట జమీందారు పటేలు చెవిలో ఈ రహస్యము చెప్పి తన మందిరమునకు మరలిపోయెను: 'జాగో! నీ యిష్టప్రకారము వెళ్ళవచ్చును; కాని నిశీథ సమయమున నీకు ధాన్యపుబండి యెత్తుటలో చేయూత యొసఁగఁగల భూస్వామిని మాత్రము సంపాదించుకొనుము.'

అది విని, నిర్ఘాంతపోయి పటేలునకు నోట మాట రాక, స్వాంతమున నిట్లు తలఁచెను:- 'మొన్నను బండి యెత్తినది నిజముగ యజమానుఁడే. తన సొమ్ము దొంగిలుటలో తానే నాకు సాయపడినాఁడు. నా

మర్యాద కాపాడుటకై అతఁడు నన్ను క్షమించి ఊర కున్నాఁడు. ఎంత దయాళువు ! చాటున నైనను నన్ను మందలింపఁడాయె. ఎంత వెన్నవంటి హృదయము ! ఆహా ! వేయిజన్మము లెత్తినను ఇట్టి సత్ప్రభువు ప్రాపు మఱెక్కడనయిన నాకు లభించునా ? ఎట్టి ఉదార హృదయుఁడు ! '

పశ్చాత్తాప పూర్వకమగు ఈ తలఁపులతో సిగ్గుపడి, యజమానుని యెడఁ దన కృతజ్ఞత వెలిపు చ్చుచు, వెంటనే బాడ్లింటికి మరల్చెను.

* * * * *

జాగోపటేలు సంతతి వారు నేఁటికిని గుజ రాత్ దేశమున 'వేడాడ్' గ్రామమున నున్నారు. ఇది జరిగి ఇప్పటికి సుమారు నెబ్బదియైదు వత్సరములే యైనది. గజాభాయిగారి లెక్కలేని ఔదార్యకృత్యములలో నిది యొకటి !

# దాస్య విముక్తి

'స్విట్జర్లాండు' లోని 'ఆల్ట్‌డార్ఫ్' మార్కెటు స్క్వేరు'ను దాటి సుందర విగ్రహుఁ డొకఁడు పోవు చుండెను. అతఁ డొకఁ కొండదొర. ఆజానుబాహుఁడు; పొడుగునకుఁ దగిన చక్కని స్థౌల్యముగలవాఁడు; అంద మగు గడ్డమును ఉదయభాస్కరునిఁబోలు ఎఱ్ఱని ముఖ మునుగల దర్శనీయుఁడు. సిరులు చిమ్ము చూపులతోఁ జఱునవ్వులతో అతఁడు మిత్రులఁ బలుకరించుచు ఠీవిగ పెద్ద పెద్ద అంగలు వేయుచు నడచుచుండెను.

ఆతనిఁ జూచిన ఎల్లరును 'అదిగో! బర్గ్లెన్ ధానుష్కచక్రవర్తి పోవుచున్నాఁ' డందురు.

స్విట్జర్లాండులో ఈతఁడు మేటి విలుకాఁడని ప్రసిద్ధి. 'యూరీ' సరస్సులో తుపాను పట్టినపుడు ఈతఁ

# దాస్యవిముక్తి

ఒక్కఁడే కడు సాహసముతో పడవ నడుపఁగలిగెను. భార్యాబిడ్డలను పోషించుకొనుచు కొండలలో నొక కుటీరము వేసికొని వసించుచుండెను.

కొండలపై లేళ్ళను వేటాడుటయు సరస్సులలో చేఁపలు పట్టుటయు అతనికి నిత్యకృత్యములు. ఇల్లు పొంకముగను పరిశుభ్రముగను ఉండును. కుటుంబమునకు కూడుగుడ్డల కిసుమంతయు లోపము లేదు. ఇంత శాంతియుతముగను తృప్తిగను కాలక్షేపము చేయుచున్న కుటుంబము ఆ చుట్టుపట్ల నిది యొక్కటియే యని చెప్పవచ్చును.

మన కథానాయకుఁడగు ఈ 'విల్యంటెల్' మార్కెట్టునకు తెచ్చిన జంతుచర్మముల కట్టనంతయు అమ్మివైచి, బిడ్డలకు ఉన్నివస్తులు కొను సంకల్పములో నిపుడు పోవుచున్నాఁడు. చేతిలో పుష్కలముగ సొమ్ముండుటచే ఉల్లాస చిత్తుఁడై యుండెను. అడ్డంకు లేమియు రానిచో ఇంచుమించుగ నింకొక్క గంటలో పాటలు పాడుకొనుచు సానందముగ తన శైలకుటీరము చేరి యుండును.

ఆకస్మికముగా వెనుకనుండి వచ్చి ఒక ఆస్ట్రియను సిపాయి ఆతని భుజమును గట్టిగ పట్టుకొనెను. మఱొక్క నిమిషములో పలువురు సిపాయీలు వచ్చి అతనిని చుట్టుకొనిరి. తెక్క పట్టుకొనిన యోధుఁడు— చివరను కిరీటముగల ఒక స్తంభముఁజూపి —

'ఆ కిరీటమునకు వందనము సేయకుండఁ బోవుచో చావు మూఁడుననను సంగతి ఎఱుఁగవా ?'

'సైక్స్' రంతయును నిశ్శబ్ద మయ్యెను. దుకాణదారులు వ్యాపారము కట్టిపెట్టి ఇచ్చుట మూఁగిరి. ఏల? వర్తకముకంటెను ఎక్కువయగు — ఒక మానవుని స్వేచ్ఛ, దేశ స్వాతంత్ర్యము — ఇపు డపాయస్థితిలో నున్నది గనుక !

విల్యంటెల్ ముఖము ఎఱ్ఱపాఱినది. తీక్ష్ణమగు తన దృష్టిని స్తంభముపై నున్న కిరీటమునుండి సిపాయి ముఖముపైకి మరల్చి మెల్లగా ననెను:

'నేనేమియు నక్రమ మొనరింప లేదే ?'

సిపాయి:— ప్రభుత్వపు ఘనతను తిరస్కరించితివి.

## దాస్యవిముక్తి

టెల్:— (తేరిపాఱ చూచుచు)

'పట్టి కోటునకుఁగాని ఇజారునకుఁగాని లేని పూజ ఈ టోపీకేల చేయవలెను ?'

ఇంతలో వెనుకనుండి కొందఱు యోధులతో క్రూరుఁడగు గవర్నరు—జెస్లర్—వచ్చెను.

ఒకప్పుడు స్వతంత్రరాజ్యముగ నుండి 'డ్యూకాఫాస్ట్రియా' చే జయింపఁబడిన స్విస్ దేశపు స్వేచ్ఛ నణఁగఁద్రొక్కిన మహానుభావుఁడీ 'జెస్ల' రే. ఆయన కెదురు చెప్పిన వారినెల్ల చంపించెను. ఆ స్తంభమునకు మ్రొక్కని వారెల్లరును వధింపఁ బడుదురు—అనునది కడకు జారీ చేయించిన కఠిన శాసనము.

విల్యంటెల్ గవర్నరువంకకు తిరిగినాఁడు. ఈతఁ డెవ్వరికిని భయపడఁడు. అతని సహజ గర్వము నెవఁడును అణఁపఁ జాలఁడు. తన దేశమునకు బానిసతనమువలనఁ గలిగిన సిగ్గుపాటును గుఱించి పెక్కుసారులు చింతించి కొండలలోని మిత్రులతో అస్వాతంత్ర్య శృంఖలా విమోచనోపాయములఁగూర్చి ఇదివఱకే ఆలోచనలు సలిపెను, క్రూర ప్రభుత్వసూచకమగు అసహ్య చిహ్నము నెన్నఁడును పూజించుట కిచ్చగింపఁడు.

సిపాయీలు వందనములు సల్పుచుండఁగా టెల్ దగ్గఱకు వచ్చి గవర్నరు:—

'ప్రభు చిహ్నమును గేలిచేసెదవా ?' అను సంతలో గుంపులోనుండి 'నాయనా ! నాయనా !!' అను కేకలు వినఁబడెను.

ఇంటియొద్ద చెప్పకుండ సంతకు వచ్చిన విల్యాం టెల్ ముద్దుకుమారుఁడు తండ్రి దగ్గఱకు పరువెత్తఁబోవు చున్నాఁడు. ఇదిచూచి ప్రజ నివ్వెఱపడిరి.

గవర్నరు:— ఆ కుఱ్ఱని పట్టుకొని ఆఁపి అలక్ష్య భావముతో—

'వీఁడేనా ధైర్యవంతుఁడగు రాజద్రోహిగారి పుత్రరత్నము ?'

టెల్:— వానిని తాకవలదు; వాఁడు నా జ్యేష్ఠ పుత్రుఁడు !

గవర్నరు:—నే నేమియు చేయను. ఏదయిన హాని కలుగుచో నీవలననే కాని నావలన కలుగదు. (సిపాయితో) ఈ పిల్లవానిని ఆ చెట్టునకు కట్టి నెత్తి మీఁద ఒక రేఁగుపండు నుంచుము.

టెల్:—ఎందుకొఱకు ?

## దాస్య విముక్తి

గవర్నరు:—నీవు బర్గెన్ ధనుర్విద్యా పారంగత బిరుదాంకితుఁడవఁట కాదా ! నీ ప్రావీణ్య మేదో నా కగపఱుపుము. నిజముగా నీవు ప్రాణములు గోల్పో వలసినదే ; కాని ఇపు డుల్లాస హృదయుఁడనై యుండుటచే దయచూపి నీకా అపాయము తప్పించు సంకల్పముతో నొక అవకాశ మొసఁగఁ దలఁచితిని. రమ్మో, నామాట వినుము, నీ పెద్దకొడుకు తలపై నున్న రేఁగుపండు రెండు చెక్కలగునట్లు ఇటనుండి నీ బాణముతో కొట్టవలెను. విజయము పొందితివా నిన్ను నదలెదను. కొట్టలేక పోయినను బిడ్డ కేమాత్రమయిన గాయము తగిలినను నిన్నిక్కడనే ఉరి దీయించెదను.

టెల్:—(కోపముచే కంపితుఁడై) కనికరము లేదా ? ముద్దుబిడ్డను చంపుకొని ప్రాణములు కాపాడు కొందుననుకొంటివా ?

గవర్నరు:— గొప్ప ఉపకారము చేయుచున్నాను, ఆలోచించుకొనుము. అదృష్టముచే దెబ్బ సూటిగ కొట్టితివేని ప్రాణము దక్కించుకొని ఇల్లు చేరఁగలవు.

టెల్:— (వణకుచు చేయిచాఁచి)

కణతలకు సరిగా ఒక్క అంగుళము పైకి ఊఁచ సాధింపవలసి యున్నది. కుమారునిమీఁద ప్రేమ గల ఎవ్వఁడైన గుండె దిటవు చేసికొని కొట్టఁగలఁడా ? ఈబిడ్డనివైపు చూడుము, వానివైపు చూడుము! ఎట్టివిన్యాసములతో వాఁడు నా హృదయమునందు తాండవమాడుచున్నాఁడో నీ కెట్లు తెలియఁగలదు ? ఆహా ! ఆ నిరపరాధుని— ఆ యమాయికపు చూడ్కులవానిని ఆ చక్కని ముఖబింబము వానిని—ఆ సుకుమారప్రాణిని నేఁ గోల్పోవలసినదేనా ?

జెస్లరు:— (పరిహాసప్రాయముగ నవ్వుచు)
'కొట్టినను సరే, చచ్చినను సరే.'

టెల్:—చచ్చెదను !

జెస్లరు:— నీ కనులముందు నీ కుమారుని పీఁక పిసికించిన తరువాతనే ఆ పని.

ఉదారుఁడగు కొండదొర ఉద్రేక పూరితుఁడై—

'విల్లు తెండు. కాని ఒక్క ప్రార్థన; కుఱ్ఱవాని మోముమాత్రము నా కగపడకుండునటులు అటుప్రక్కకు త్రిప్పవలెను, నేను చూడఁజాలను' అనెను.

# దా స్య వి ము క్తి

తండ్రి బిడ్డల నడుమ నొకదారి యేర్పడినది. ఇరువైపుల ప్రజ క్రిక్కిరిసి యుండినది. పిల్లవాని ముఖము చెట్టుదెస త్రిప్పి, వానిని త్రాళ్ళతో బిగియఁగట్టి, ఒకపెద్ద రేఁగుపండు తలపై నుంచిరి.

మార్కెటు స్క్వేరంతయు చీమ చిట్టుకుమన్నకూడ వినఁబడునంత నిశ్శబ్దముగ నుండెను. టెల్ రెండు శరములు చేకొనినాఁడు, అందొకటి అమ్ముల పొదిలో నుంచినాఁడు, రెండవది వింట సంధించినాఁడు, ఒక్క నిమిషమాఁగి అక్షులుమూసి మోఁదల వంచి భగవంతుని ప్రార్థించుకొనినాఁడు. పిదప శిరము పైకెత్తి దృష్టి నిలుకడగ నుంచినాఁడు. ముఖమునఁ రౌద్రరస మొలుకుచు గుఱిపెట్టినాఁడు, కొట్టినాఁడు ! 'ట్వాంగ్ !!'

దెబ్బతో రేఁగుపండును ముక్కలుచేసి యిరువైపులఁ బడవేసి ఊఁచ చెట్టును దూసికొనిపోయెను.

ఈ యద్భుత దృశ్యమునఁ గలిగిన సంతోషముచే ప్రజలు కావించిన జయజయ ధ్వానములు మింట ప్రతిధ్వనించుచుండెను.

జెస్లర్ :—మంచి దెబ్బయే ! కాని రెండు ఊఁచ లెందుకు తీసితివో చెపుము.

కెల్:— (పాదిలోనున్న ఊంచపై చేయి వైచి) మొదటిదానివలన నా బిడ్డకు హానియే కలిగి నచో రెండవ యూంచ ఈపాటికి నీ గుండెనడుమ దూకియుండెడిది !

జెస్లర్:— ఓరి ద్రోహీ ! నా ప్రాణములకే దిలంచితివేమి ! సరే, ఇచ్చినమాట తప్పను. నీకు ప్రాణ దానము చేసెదను. కాని నీవు జీవితాంతమువఱకు నా కోటలోని చీకటి కొట్లలోనే వసింపవలెను ; అటయి నచో నీ బాణమునలన నా కపాయ ముండదు.

అంతట ముష్కరులగు సిపాయీలచే తిరిగ కెల్ బాధింపఁబడి లంగరు వేసియుంచిన గవర్నరుగారి పడవ రేవునకుఁ గొంపోవఁబడెను.

పడవ 'యూరీ' సరస్సు దాఁటుచుండఁగా గొప్ప తుపాను వీచుటచే నెల్లరును భీతాత్ములై యుండిరి. అస్త్రయానులకు అసువులపై ఆశ లంతరించి నవి; పడవ నోటు నడపుటకును దోపక అంతయు లగిమ్మ్యముగ నుండెను.

ఉపద్రవకరమగు నిట్టి స్థితిలో— ఆ ప్రాంత ము దుండు వానలలో పడవ నడుపుటయందు కెల్

మహాప్రవీణుఁడను సంగతి జ్ఞప్తికి వచ్చి గవర్నరుతో వారు ప్రస్తావించిరి.

అతనిని బాధవిముక్తునిఁ జేసి చుక్కాను చేతి కిందని జెస్లరాజ్ఞాపించెను. టెల్ పడవను అవ్వలి యొడ్డునకు మరలించెను. ఇపు డతఁడు జెస్లరునుగుఱించి కాని ఆస్ట్రియనులను గుఱించికాని ఎంతమాత్రము యోజించుటలేదు. తన స్వాతంత్ర్యము తన మాతృభూమి యగు స్విడ్జర్లండు స్వాతంత్ర్యము—వీని గుఱించియే తలపోయుచుండెను.

పడవ నొక గుట్టదరికిఁ జేర్చి నిలిపి తా నీవలికి దుమికి ఆస్ట్రియనులను వారి కర్మమునకు వదలెను.

చులుకనైన నడక గలవాఁ డగుటచే గుట్టలు మెట్టలు సుకరముగ దాఁటి కొండలపైనుండి ఒక కాలి బాట బట్టెను. జెస్లరు ప్రాణముఁ దక్కించుకొనఁ గలిగి నచో ఈ బాటమీఁదుగనే పోవలసి యున్నది. ఇచ్చట రోడ్డుప్రక్కను తుప్పలలో టెల్ దాఁగుకొని ఊఁచ సంధించి 'ఎప్పు డీ క్రూరుని బాధమునుండి నా స్విడ్జర్లండును విముక్తము చేయఁగలుగుదునా?' యను సంతతదృష్టితో సిద్ధముగ నుండెను.

అనుకొన్నట్టుగానే కొంచెము సేపటికి అడుగుల చప్పుడు వినవచ్చినది.

జెస్లర్ నడచుచు:—

'నేనే ప్రాణములతో ఆల్ట్‌డార్ఫ చేరఁగలిగితినేని టెల్ యొక్క కుటుంబమును సర్వనాశనము చేసెదనని ఇదే ప్రతిన చేయుచున్నాను. తల్లిని పిల్లలను అందఱను ఒక్కపెట్టున బరిమార్చెదను' అనుచు ఆ కాలిబాటనుండి నడచి పోవుచుండెను. ప్రక్క పొదనుండి 'ట్వాంగ్' మను ధ్వనితో ఒక నిశితమగు శరము వచ్చి జెస్లరు హృదయమును దూసికొనిపోయినది. అతఁడు ప్రాణములు వదలి నేలఁగూలినాఁడు.

తరువాత టెల్ స్విస్ ప్రజలను పురికొల్పి ఆస్ట్రియాపైకి దండెత్తి జయము గాంచెను. నాఁటినుండియు స్విడ్జర్లండు ప్రజలకు దాస్య శృంఖలలు విడువడినవి!

వారు టెల్‌ను ప్రభువుగా నేర్పఱుచు కొనఁ గోరిరి కాని యతఁడందుల కంగీకరింపలేదు. వేయి రాజ్యములపెట్టుగు తన 'శైల కుటీరము' లోనే అత్యంత శాంతి సౌఖ్యములతోఁ దన జీవితము గడపుకొనెను !

# నిలుకడమీఁద నిజము

కరుణాకరుఁడు అందమైన యువకుఁడు. ఉంగరములు తిరిగిన ఆశిరోజము లతని చక్కదనమునకు శోభ రెట్టించినవి. హాస్య వచనాభిలాషి. సంగీత ప్రియుఁడు. స్వవృత్తి నిరతుఁడగు నతఁడు ఒకనాఁడు నాణెమయిన సరకు తీసికొని కాకినాడకు పయనమయ్యెను. 'పోయి వచ్చెద' నని భార్యతో చెప్పఁగానే ప్రయాణము నాఁటికి విరమింపుఁడని ప్రార్థించినది.

సెట్టి (నవ్వుచు):— ఎందుచేత ?

భార్య:— నేనొక పాడుకల గంటిని. మీరూరనుండి తిరిగివచ్చి తలపై టోపీ తీయుసరికి నెత్తియంతయు నరసి ముగ్గుబుట్టవలె నైనది !

సెట్టి (మందహాసముతో):— అది శుభసూచకమే సుమా ! సరకంతయు విక్రయించి నీవు కోరుకొనిన బహుమతులు కొనిరాకపోయినప్పుడు నన్నడుగుము !

అనుచు చెప్పి బయలుదేఱెను.

పనిమీఁద అనకాపల్లిలో ఆగెను. అటనొక వణిఙ్మిత్రుఁడు కనఁబడినాఁడు. ఆ రోజున ఒక హోటలులోనే బసచేసి, ఉభయులును కలిసి కాఫీ పుచ్చుకొని రాత్రిపూఁట ప్రక్క గదులలోనే పండుకొనిరి.

పెందలకడనే నిద్రపోయి చల్లని ప్రొద్దున పయనము సలుపుట కరుణాకరునకు మామూలు. ఆ యలవాటు చొప్పున తెల్లవారుజాముననే మోఁటారు సిద్ధముచేయించి హోటలు యజమానుని కీయవలసినది చెల్లించి ప్రయాణము సాగించెను.

తునిలో మకాముచేసి అటసెట్టి విశ్రాంతి గైకొనెను. డ్రైవరు కారులో పెట్రోలు వేసి సిద్ధము చేయుచుండెను. సేవకుఁడు కాఫీ తయారుచేయుచుండెను. కరుణాకరుఁడు గ్రామొఫోను తీసి క్రొత్తగా కొన్న కొన్ని ప్లేటులు పాడించుచు ఆనంద పరవశుఁడై యుండెను.

ఆ స్థితిలో హఠాత్తుగా ఒక కారులో జిల్లా పోలీసు సూపరింటెండెంటు నల్గురు పోలీసులతో అక్కడకు వచ్చి 'నీ వెవరవు ? ఎక్కడనుంచి వచ్చితివి ?' అని సెట్టి నడిగెను. అతఁడు ప్రత్యుత్తరము నిచ్చుచు

'దయచేయుఁడు, కొంచెము కాఫీ తీసికొందురు గాని' అని సవినయముగ ఆయన నాహ్వానించెను. కాని అధికారి ఊపిరాడకుండ మరల నిట్లు ప్రశ్నింపఁ గడంగెను:- 'గతరాత్రి నీ వెట నుంటివి ? ఒంటిగ నుంటివా, ఎవరయిన నేస్తుని కూడి యుంటివా ? ఆ మిత్రుని ఈ యుదయమున చూచితివా? అంత తెల్లవారక మునుపే బసేల విడిచితివి ?'

తరచి తరచి ఏల ఇంతగ ప్రశ్నించుచున్నాఁడో అని సెట్టి విస్మితుఁడై జరిగిన వృత్తాంత మంతయు పూస గ్రుచ్చినట్లు చెప్పి 'అయ్యా ! నేనేమో దొంగనైనటు లేల యిట్లు ప్రశ్నించుచున్నారు ? నా వ్యాపారము మీఁద నేఁబోవుచుంటిని ; ఈ ప్రశ్న లేల ?' అనెను.

అంతట అధికారి భటులను పిలిచి సెట్టితో:- రాత్రి నీతోనుండిన వర్తకుని ఎవరో కుత్తుక ఉత్తరించి చంపినారు. నిన్నిట్లు గ్రుచ్చి గ్రుచ్చి అడుగుట కిదే హేతువు. ఇపుడు నీ సామానులు సోదా చేయవలసి యున్నది.

అధికారి సంజ్ఞపైని భటులు వర్తకుని సామానులన్నియు వెదకసాగిరి. అధికారి కూడ వెదకుచుండఁగా

ఒక సంచిలో నొక కత్తి కనపడినది. గభాలున దానిని పైకితీసి 'ఇదేమి ?' అని అతఁడు కేక వేసినాఁడు.

రక్తసిక్తమై యున్న ఆకత్తి తన సంచినుండి అధికారి తీయుట గని, సెట్టి భయకంపితుఁ డయ్యెను. 'ఈకత్తి యేమి? ఈ రక్త మేమి ?' అని ఆశ్చర్య పడి నాఁడు. అధికారి ప్రశ్నకు బదులుచెప్ప యత్నించెను గాని గళము స్తంభించిపోయి నోట మాట రాకపో యెను. కష్టముపైని తడఁబడు మాటలతో 'నే నె-ఱుఁ-గ-ను, నా-ది కా-దు' అనెను.

అధికారి:—ఈ యుదయమున వర్తకుఁడు పీఁక తెగి చచ్చి పడియున్నాఁడు. ఈ పని నీవే చేసి యుండవలెను. ఇంటితలుపు లోపల తాళము త్రిప్పఁబడి యున్నది, అట మఱెవ్వరును లేరు. ఇదిగో, ఇక్కడ రక్తమయమైన కత్తి నీయొద్ద దొరకినది. నీవే ముద్దాయి వైనటులు నీ వాలకమే చెప్పుచున్నది. ఎట్లు చంపితివి ? నిజము చెప్పుము.

కరుణాకరసెట్టి 'నే నేపాప మెఱుఁగను, ఎఱుఁగను దేవుఁడా !' అని చేతిలో చేయివేసి ఒట్టు పెట్టుకొనినాఁడు; రాత్రి శయనించుటకేగిన పిమ్మట

అతని జాడయే తెలియలేదని మొఱపెట్టినాఁడు; ఆ కత్తి తనది కాదని నమ్మఁబలికినాఁడు. కాని—స్వరము హీన మైనది, ముఖము పాలిపోయినది, అపరాధివలె అతఁడు కంపించిపోవుచుండెను.

బేడీలు వేసి కారులో కూర్చుండఁ బెట్టుఁడని అధికారి భటుల కాజ్ఞాపించినాఁడు. అతనిని కట్టి కారులో నెక్కించునపుడు సెట్టి మాఱుమొగము పెట్టుకొని వెక్కి వెక్కి యేడువ సాగెను. అతని సామాను, సొమ్ము, అంతయు పోలీసువారు అధీనము చేసికొని సెట్టిని జైలు నకు గొంపోయిరి. కేసు విచారణకు వచ్చెను. వర్తకుని చంపినట్లును ఇరువదివేలు హరించినట్లును సెట్టిపైని నేరము స్థిరపడినది.

ఈ వైనము తెలిసిన కరుణాకరుని భార్యకు మతి పోయినది; ఏమాటయైన నమ్ముటకుఁగాని నమ్మకపోవు టకుఁగాని పాలుపోకుండెను. పాపము! పిల్లలు పసి పాపలు! ఒకఁ డాడబిడ్డ, ఒకఁడు మగబిడ్డ. వీరిని వెంట నిడికొని ఆమె పతిచెంతకు పయనమైనది. భర్తనుచూడ వలను పడదని మొదట ఆమెప్రార్థన నిరాకరించిరి. కాళ్లు వ్రేళ్ళుఁ బడి అనేక విధముల వేఁడుకొన్నపిమ్మట జైలు

ఉద్యోగస్థులు అందుల కనుమతించిరి. ఆ జెయిలు దుస్తులతో ఆ బేడీలతో కేడీల నడుమనున్న తన భర్త యవస్థ గని ఆమె స్మృతిదప్పి క్రిందఁబడి, చాల సేపటికిఁగాని తెప్పిఱిల లేకపోయినది. తెలివి వచ్చినపిమ్మట, కొసుఁగందులను చేరఁదీసికొని భర్త సమీపమున కూర్చుండినది. గృహవిషయములు ముచ్చటించిన పిదప అతనిచరిత్ర అడిగి తెలిసికొనినది. జరిగిన కథ యంతయు అతఁడు దాఁపక చెప్పినాడు.

భార్య:—అయినచో మన మిపుడు చేయున దేమి?

క:— శిక్ష రద్దుపఱుపఁగోరుచు అధికారులకు విన్నవించుకొనవలెను.

భార్య:—అపుడే అయినది. వీలు లేదనిచెప్పి మనవి నిరాకరించి శిక్ష ఖాయపఱచితి మనిరి.

అతఁడు మాఱుమాటాడక అధోదృష్టిఁ బఱపి అటులే కూర్చుండెను.

భార్య:— నా కా పీడకల వచ్చినందులకు ఊరక పోలేదే! మీకు జ్ఞప్తి నున్నదో లేదో, మీ తల నరసిపోయినటులు కల గంటిని కాదా! నా ప్రార్థన అంగీకరించి ఆనాఁడు ప్రయాణము మానివేసిన నెంత

బాగుండెడిది !— (వేళ్ళతో అతని కురులు నిమురుచు) నాతో నిజము చెప్పుఁడు. ఆ చంపినది నిజముగ మీరు కావా ?

క:—ఏమి? నీవును—అయ్యో ! నా అర్థాంగివైన నీవును—నన్ననుమానించుచుంటివా ?

అని మొగము చేతులతో కప్పుకొని బావురు మని పెద్ద పెట్టున ఏడ్చెను. అంత నొక సేవకుఁడు వచ్చి ఆమెను పిల్లలను వెంటనే అటనుండి వెడలిపొండని చెప్పఁగా, సెట్టి తన కుటుంబమును కడసారి చూపుగా చూచుకొనినాఁడు ! కంపిత కరములతో కన్నబిడ్డల నెత్తుకొని తుదిముద్దు లిచ్చినాడు! ఎలుఁగెత్తి జాలిగా నేడ్చెడి భార్యను దుఃఖ బాష్పములతో విడువలేక విడువలేక విడిచినాఁడు !

వారు జైలుగుమ్మము దాఁటిన వెంటనే ఆ ప్రసంగమంతయు జ్ఞప్తికిఁ దెచ్చుకొని తన సతియే తనపై ననుమానపడినదను సంగతి తలఁపునకువచ్చి చింతించినాఁడు.— 'నిజము దేవుఁ డెఱుఁగును, పరమేశ్వరుని ప్రార్థించిన మేలు, మానవుని అర్థించుట వ్యర్థము, అవ

మానకరము. రక్షించినను శిక్షించినను ఆ జగన్నాటక సూత్రధారుఁడే !'

మనుజులవలన పొందఁగల ఉపకృతి శూన్య మను ఉద్దేశముతో అధికారుల కిఁక ప్రార్థనపత్రములు పంపుకొనుట కట్టిపెట్టినాఁడు. ఈ విషయమున అధికారులు సాహాయ్యము చేయుదురను ఆశ మానుకొని భగవద్ధ్యానపరాయణుఁ డైనాఁడు.

పిదప — అతనికి విధించిన శిక్షప్రకారము భటులు ఒక ఇనుపకొరడాతో కరుణాకరుని చావఁగొట్టిరి. ఆ గాయములు మానిన పిమ్మట ద్వీపాంతరవాసమునకు తక్కిన ఖైదీలతో అతనిని అండమాను దీవులకు పంపిరి.

పాపము ! సెట్టి ఇఱువదియారు దీర్ఘవత్సరములు అండమాను ద్వీపములలో జీవితము గడపినాఁడు. తలవెంట్రుకలు ముగ్గువలె తెల్లపడినవి. గడ్డము పొడవుగా సన్నముగా బలిసి బూడిదవర్ణము కల్గియుండెను. ఉల్లాసమే ఉడిగిపోయినది. కష్టజీవనముచే క్రుంగి కృశించినాఁడు. అతడిపుడు నెమ్మదిగా అడుగులు వేయును. అతిమిగముగ భాషించును. నవ్వు అనునది ఎప్పుడో నశించి

పోయినది ఆతనిలో. ప్రకృతము ఈశ్వర చింతనము తక్క వేఱు వ్యాసంగము లేదు.

ఇతనికి చిన్నతనమునుండి చేతిపనులు చేత నగుటచే చాఁపలు చదరలు అల్లుచు అవి అమ్మి కొంత ఆర్జించినాఁడు. దానితో కొన్ని మతగ్రంథములను కొని జైలులో తీరిక సమయమంతయు గ్రంథపఠనములో విని యోగించు చుండును. రాత్రిపూఁట చాలసేపు 'భక్తి యోగము'ను గూర్చి ఉపన్యాసము లొసఁగి మిత్రబృందమునకు ధన్యత చేకూర్చును.

ద్వీపములోని జైలు ఉద్యోగస్థులు సౌశీల్యదక్షుఁడయిన సెట్టిని మిక్కిలి ప్రేమించి గౌరవించుచుండిరి. తోడి ఖైదీలు అతనిని 'తాతా! తాతా!' అని భక్తిపూర్వకముగా పిలుచుచు పూజించుచుండిరి. అధికారుల కేదయిన అర్జీ పంపుకొనవలసినచో ఇతఁడే ముసాయిదా వ్రాయవలెను. ఖైదీలలో నేవయిన పేచీలు వచ్చినచో అవి దిద్ది తీర్పుచెప్పు న్యాయాధిపతి ఈతఁడే!

కరుణాకరునకు ఇంటి సంగతు లేమియు తెలియవచ్చుట లేదు. ఆలు బిడ్డలు బ్రదికియున్నారో గతించినారో కూడ ఎఱుఁగరాదాయెను.

ఇట్లుండ—ఒక దినమున క్రొత్త ఖైదీల గుంపు దిగినది. ఆ సాయంకాలము ప్రాంత ఖైదీలందఱు క్రొత్త వారి చుట్టును మూఁగి ఎవరెవ రేయే యూళ్లనుండి వచ్చిరో, ఏయే నేరములకు శిక్ష పొందిరో కనుఁగొనఁ జొచ్చిరి. సెట్టి ఒక మూల కూర్చుండి దృష్టి క్రిందికిఁ బఱపి అటే చెవియొగ్గి వినుచుండెను.

క్రొత్త ఖైదీలలో నొకఁడు అజానుబాహువు, అఱువదేండ్లవాఁడు, నరసిన ఒత్తుగడ్డము కలవాఁడు—తానేల శిక్షింపఁ బడెనో ఇటులు నివేదించెను:— 'నా సంగతి చెప్పెదను వినుఁడు ! బండికి కట్టియున్న ఒక గుఱ్ఱమును తోలుకొని పోయితిని. ఇదె నేఁ జేసిన తప్పు. దొంగతనము నేరము మోపి నన్నుఁబట్టి శిక్షించిరి. ఇంటికి త్వరితముగా వెళ్లవలసిన అగత్యముండుటచే దాని నెక్కి వెళ్ళి, తిరుగ నటనే వదలివేసితిని. అదియుఁ గాక సారటువాఁడు నాకు కావలసిన మిత్రుఁడు. ఈపని అతనికి అంగీకారమే. అందుచేత దోష మారోపించుట న్యాయము కాదని నేను వాదించితిని. 'అదంతయు మాకు తెలియదు, నీవు దొంగ' వని కోర్టువారు శాసించిరి. నే నెట్లు దొంగిలితినో ఎక్కడనో వారు రుజువుపఱుపఁ

దగిన బలమగు ఆధారములు లేవు. మున్నొక పర్యా యము నిజముగా తప్పొనరించి యుంటిని; న్యాయముగా అప్పుడే నే నిక్కడకు రావలసి యుండెను; కాని అప్పుడు తప్పించుకొనియే పోయితిని. ఇప్పుడు సరియైన నేరము చేయకున్నను నిష్కారణముగ శిక్షింపఁ బడితిని'

(ఎగతాలిగ నవ్వుచు)

'హా - హ్హా - హ్హా ! అన్నియు ఉత్త మాటలే! ఈవల కప్పుడే ఇట కొక పర్యాయము వచ్చియుంటిని, ప్రాఁత పిల్లినే! కాని అట్టి కాల ముండ లేదు.'

ఒకరు:— మీ దే యూరు ?

అతఁడు:—మాది విశాఖపట్నము, నా పేరు రాయప్ప.

సెట్టి (తల పై కెత్తి):—ఏమయ్యా, రాయప్ప గారూ !—మీయూర కరుణాకర సెట్టి యను కోమటి నెఱుఁగుదురా? అతనికుటుంబమువా రింకనుఎవరయిన జీవించియున్నారా ?

రా:—ఎఱుగ కేమి? యజమానుఁడు ద్వీపాంత రము పంపఁబడినాఁడు గాని అతనిపుత్రులు శ్రీమంతులై నిక్షేపమువలె కాలక్షేపము చేయుచున్నారు. పాపము !

కోమటిబిడ్డ !—మా వలెనే పాతకుల చిట్టాలోని కెక్కి-
ఇట నరక మనుభవించు చున్నాఁడఁట ! —తాతా ! నీ
వేల వచ్చితివి ?

తన దుఃస్థితి వెలిపుచ్చుటకు కరుణాకరుఁ డిచ్ఛగింపలేదు. ఒక్క నిట్టూర్పు విడిచి— 'చేసికొన్న పాపములు కట్టి కుడుపకుండునా ? దాఁచికొనిన ఏనాఁటి సంచితార్థమో ఇరువదియాఱు వత్సరముల నుండియు అనుభవించుచున్నాను. తప్పునా ? గత జన్మములో ఏ ఆలుమగల కెడఁబాపులు చేసితినో !'

రా:— ఏమి తప్పు చేసితివి ?

క:—ఏమియు లేదు. ఈశిక్షకు తగియుంటిని కనుకనే దానిని పరమేశ్వరుఁడు నాకు విధించినాఁడు.

అతఁడిం కేమియు చెప్పఁదలఁచు కొనలేదు కాని, దగ్గఱ వారు—తుమ్మెఁడొకఁడు ఖూనీచేసి ఆకత్తి ఇతని సామగ్రిలో దూర్చిన విధమును, దానిపై నిర్హేతుకముగ నితఁడు ముద్దాయిగా విమర్శింపఁబడి శిక్ష పొందినట్లును రాయప్ప కెఱిఁగించిరి.

ఈ యుదంత మాలించిన తోడనే రాయప్ప కరుణాకరుని వంక ఆర్త్రై ఒకపరి చూచి మోఁకాలు తట్టు

కొని విస్మయముతో:— 'ఏమీ చిత్రము! ఈ విచిత్రము!! చాల స్వర్గారోహ్యముగ నున్నదే, ఈశ్వర విలాసము!— కాని తాతా! ఎంత ముసలి వైపోయినావు!'

'అంత వింతగ నడుగుచుంటివే! పూర్వ పరిచయ మేమైన నున్నదా యేమి? అని యచటివారు రాయప్ప నడిగిరి. అందుల కతఁడు మాఱు పలుకక 'ఉభయులము ఇచట సమావేశమగుటయే అద్భుతవిషయ' మని నుడివి మిన్నకుండెను.

వర్తకుని ఖూనీ వైనము రాయప్ప కేమాత్రమో తెలిసియుండవలెనని సంభాషణమును బట్టి యూహించి, సెట్టి:— 'ఏమండీ, రాయప్పగారూ! వర్తకుని ఖూనీవార్త వినియుంటిరి కాఁబోలు! లేక నన్నెచటనయిన వెనుక చూచిన జ్ఞాపకమో!'

రా:— చెవులు గింగురుమనుచుండ వినకుండ నెట్లులుండుట! లోకములో ననేక వదంతులు వ్యాపించి యున్నవి. అబ్బో! అదేనాఁటి ముచ్చట! నాకప్పుడే పరగడుపే యైనది!

క:— కాని, చంపిన దెవరో మీకు తెలియు ననుకొందును.

రా_ (నవ్వుచు):—కత్తి ఎవరిసంచిలో దొర కెనో వారే చంపియుండవలెను ! మరెవ్వరయిన చంపి ఆకత్తి నీ సామానులలో దాఁచినను హంతకుఁడు పట్టు వడు పర్యంతము ముద్దాయి నీవే...! అయినను, మనలో మనమాట—నీ తలక్రింద పెట్టుకొనిన సంచిలో ఇతరు లెట్లు కత్తి దూర్పఁగలరయ్యా ? నీకు మెలఁకువ వచ్చి యుండదా యేమి ?

రాయప్ప వికటపు మాటలు వినిన వెంటనే సెట్టి, ఈపని ఇతనిదే నని నిర్ధారణము చేసికొని తత్క్షణమే అటనుండి మరలిపోయి రాత్రియంతయు నిద్దురపట్టక చెప్ప రాని ఆవేదనపడెను. భావనా ప్రపంచములో — జీవి తాంశములెల్ల హృదయ ఫలకమున బయొస్కోపు చిత్ర ములవలె ప్రతిబింబితమైనవి. కాకినాడ వెళ్ళఁబోవునపుడు 'వలదు వల' దని వారించిన సతి స్వరూపము అదిగో, అతని సమక్షమందు ! చిఱునవ్వు చిందులాడుచున్న ఆ మోము, ఆ విశాల నయనములు, ఆహా ! లలిత పదములతో, మృదుమధురమగు అమృత వాక్కులతో ఎంత సవినయముగ వేడుకొనుచున్నది ! పాపము ! చిన్నారిపాపలు— ప్లేనెలు కబ్బా తొడుగుకొనిన ఎడ

బిడ్డ, తా నెంతో పెద్ద మైనటులు మారము సేయుచున్న చిన్ని తమ్ముని ఊఱడించి లాలించుచున్నాఁడు !—ఇకఁ స్వీయచరిత్రము స్మృతికి వచ్చినది: మరల ఆనందింపవలను కాని ఆ చిన్ననాఁటి సుదినములు - అరెస్టు కాఁబడిన తుని హాటలులో ఉత్సాహపూరితుఁడై గ్రామొఫోను పాడించుచుండిన ఆ మహానందసమయము — తదుపరి తాను కొరడాతో శిక్షింపఁబడుట, కొట్టిన తలారివాఁడు, బేడీలు, ఖైదీలు— ఈ యిరువదియాఱు వత్సరములు ద్వీపములోఁ గడపిన దుర్భర జీవితము - అసహజముగ ప్రాప్తించిన ముదిమి — ఇవన్నియు తన కండ్ల యెదుట సాక్షాత్కరించినవి. ఇట్టి అభాగ్యజీవనముకంటె ఆత్మ హత్య మేలని తోఁచినది.

'ఈ క్రూరునివలనఁగద !' అని పండ్లు పటపట కొఱికినాఁడు. తా నేమైపోయినను సరే తుచ్ఛుని హత మార్చి పగదీర్చుకోవలెనన్నంత కోపము రేఁగినది. రాత్రి యంతయు ప్రార్థనము చేసికొనినాఁడు గాని మనస్సు నిలు కడ లేకుండెను. పగటిపూఁట రాయప్పను చూచుట మానుకొనుటయే కాక ఎప్పుడైన అతఁడగపడె నేని పెడ మొగము పెట్టెడువాఁడు.

పక్షము గడచినది. కరుణాకరునకు కంటి మీఁద కునుకు లేదు. ఏమిచేయను పాలుపోక తీవ్రబాధా పీడితుఁ డయ్యెను.

ఒకనాఁటి రాత్రి—సెట్టి జైలులో ఇటునటు పచారు చేయుచు, బందాలు పండియున్న ఒక కొట్టులో అలమారుప్రక్క యెవరో తొలుచుటచే మన్ను వచ్చుట గనెను. అదేమో చూతమని అట్టె నిలువఁబడ, ఆక్షణముననే భయకంపితుఁడయిన రాయప్ప అలమారుప్రక్క నిలువఁబడి సెట్టి దెస తొంగి చూచినాఁడు. కరుణాకరుఁడు తనదారిని పోవుదమనుకొనినను రాయప్ప అతని చేయిపట్టుకొని నిలువఁబెట్టి—జెయిలుగోడ దొలిచి కన్నము చేయుచుంటిననియు, అందఱును పనిమీఁద పైకి పోయినపుడు జోళ్ళతో మన్ను అవల పాఱఁబోయుచుంటిననియు చెప్పెను. మఱియు నిట్లు బెదరించెను:—

'తాతా! మిన్నకుంటివా నీవు కూడ దాఁటి పోవఁగల ఉపాయము చేసెదను. రహస్యము బయలు పెట్టితివా అధికారులు నా ప్రాణములు తీయుటకు ముందే నీ ప్రాణములు నేను పుచ్చుకొందును, జాగ్రత్త!'

కరుణాకరుని యొడలు కంపించెను. రాముప్ప పట్టునుండి తన చేయిలాగికొనుచు:— 'నాకు తప్పించుకొను సంకల్పము లేదు. నీవు నన్ను చంపు అగత్యమంత కంటెను లేదు. ఇపుడేమి? చిరకాలము క్రిందటనే నీవు నన్ను బలి కోరితివి! ఇక—నిన్ను బయలుపఱుచుటా మానుటా, అనునది ఈశ్వరేచ్ఛ!'

మఱునాఁడు — ఖైదీలందఱును పనికిపోవు సమయాన— గోడ కెవరో కన్నము తొలుచుచున్నట్టును, మన్నుజోళ్ళతో ఎత్తిపోయుచున్నట్టును ఒకఁడు కనిపెట్టెను. జైలుభవన మంతయు సోదా చేయఁగా రంధ్రము స్పష్టముగ కనఁబడినది. అధిపతి వచ్చి ఆచేసిన దెవరో వాస్తవము చెప్పుఁడని ఎల్లరను ప్రశ్నించెను. ఎవ్వరును బదులు చెప్పలేదు. అపరాధిని ప్రాణము తీయుదురను భీతిచే పాపమున కొడిగట్టుకొన నిచ్ఛగింపక ఎఱిఁగినవారు కూడ చెప్పుటకు సాహసింపఁ జాలకుండిరి. కరుణాకరుఁడు పెద్దమనుష్యుఁడు, న్యాయశీలుఁడు, అను విశ్వాసముతో అధికారి చివర కతనియొద్దకు వచ్చి:— 'తాతా! నీ వబద్ధమాడవని నాకు తెలియును. దైవముఖము చూచి ఈ పని చేసిన దెవరో చెప్పు' మని అడిగెను.

రాయప్ప సెట్టివైపు తదేక దృష్టితోను అధిపతివంక తనకు ప్రసక్తి లేనట్టు నిర్లక్ష్యముగను చూచుచుండెను. కరుణాకరునకు చాలసేపు పెదవులు వణఁకి నోటమాట రాలేదు. 'నా జీవితము నాశము చేసిన హంతకుఁడు వీఁడు ; నిజమే. అయినను నేనేల అతనిని బయలు పెట్టవలెను ? రహస్యము వెల్లడించితినా ఇతని ఆయువు మూడిన దన్న మాటయే ! ఒక వేళ—నాకు ద్రోహముచేసిన యతఁ డితఁడే యని అనుమానించుటలో పొరపడితినేమో ! ఇంతకును వాని శిక్షింపించుటలో నాకు కలిసివచ్చున దేమి ?' అని దీర్ఘాలోచనములోఁ బడినాఁడు.

మరల అధిపతి:—ఏమోయి తాతా ! నిజము చెప్పుము. ఎవరీ రంధ్రము తొలుచుచున్నారు ?

రాయప్పవైపు ఒక పరి చూచి, కరుణాకరుఁడు:—అయ్యా ! నేఁ జెప్పఁజాలను, చెప్పుమని దైవాజ్ఞ కాలేదు. నా సర్వస్వము తమ అధీనము, ఏమి చేసినను సరే !

ఎన్ని విధముల యత్నించినను కరుణాకరుఁడంత కంటె నేమియు చెప్పకుండెను. అందుచే ఆ విషయము పేక్షింపఁబడెను.

# నిలుకడ మీఁద నిజము

రాత్రి కునుకుపట్టు ననఁగా ఎవఁడో కాని చప్పుడు చేయకుండ వచ్చి సెట్టి ప్రక్కమీఁద కూర్చుండెను. ఆ చీఁకటిలో కన్నులు చిట్లించుకొనుచు చూడఁగా, అతఁడు రాయప్పయే !

క:—ఇపు డిట కేల వచ్చితివి ? నన్నింకను ఏమి చేయుమనెదవు ?

రా:— (ఊరకుండెను.)

క:—(లేచి కూర్చుండి) ఏమి కావలెను ? వెళ్ళిపోయెదవా, గార్డును పిలువనా ?

రా:— (దగ్గఱకు వంగి రహస్యముగా)— తాతా ! కరుణాకరా ! ! క్షమింపవా ?

క:— ఎందులకు ?

రా:— వర్తకుని చంపి కత్తి నీ సంచిలో దాఁచిన పాతకుఁడను నేనే ! నిన్ను కూడ అపుడు పరిమార్పవలసినదే. కాని బయట నేదో అలజడి అగుటచే కత్తి నీ సంచిలో దూర్చి కిటికీలోనుండి పాఱిపోయితిని.

ఏమనుటకును సెట్టికి మాట రాలేదు.

రా:—(ప్రక్కడిగ్గి నేల మీఁద మోకరిల్లఁబడి):—తాతా ! వర్తకుని చంపినది నేనే యని తప్పొ

ప్పుకొనెదను. నిన్ను వదలెదరు, నీవు ఇంటికి పోవచ్చును. నన్ను క్షమింపుము.

క:—నాయనా! ఈమాటలు నీవు సుళువుగా చెప్పుచున్నావు. కాని ఈ యిరువదియారు ఏండ్లు నేనెంత కుందితినో, ఆలుబిడ్డల కెడమై పోయి ఎంత తపించితినో, ఊహింపఁగలవా ? ఇప్పుడు నే నెక్కడకు పోవుట ? భార్య చచ్చినది, పిల్లలు నన్ను మఱచిరి. ఇఁక నేఁ బోవలసినది కాటికే !

రాయప్ప అతని పదములంటి లేవక నెత్తి నేలను కొట్టుకొనుచు— 'తాతా ! తాతా ! ! శరణు, శరణు ! ! సదయహృదయా ! నను క్షమింపుము ! తలారులు ఇనుప కొరడాతో చెళ్ళు చెళ్ళు మని మోదినపుడయినను—ఇపుడు నిన్ను చూడఁగా పొంగి పొరలుచున్న దుఃఖము, అపారావేదన పొందియెఱుఁగను. మనసు అంత ద్రవించిపోవుచున్నది, హృదయ మంత ఉడికి పోవుచున్నది............నీ మనస్సు చాల ఉదారమైనది. నీ కింత కీడు చేసినను, దయఁబూని అధికారితో రహస్యము బయల్పరుపక ఊరకుంటివి కద ! అబ్బా ! ఏమి జాలిగుండె ! ! క్షమింపుము, క్షమింపుము ! పరమ పాతకుఁడను ! ! !'—అనుచు పట్టరాని సంతాపముతో ఏడ్చెను.

## ని లు క డ మీఁ ద ని జ ము

కరుణాకరుఁడు కూడ దుఃఖ మాఁపుకొనఁజా లక వెక్కి వెక్కి యేడువఁ జొచ్చెను. కన్నీటిధారల్తో:- రాయప్పా! పరమేశ్వరుఁడు నిన్ను కృపఁ జూచుఁ గాకఁ! నీకంటె ఎక్కువ పాపిని కనుకనే ఇట్టి యిడుమలకు నన్ను పరమేశ్వరుఁడు పాల్పరచెను.

సెట్టికి హృదయము తేలిక యైనది. ఇంటి మీఁది చిరవాంఛితము మ్రగ్గిపోయినది. శేషజీవిత మటనే గడపుచు అస్తమయ సమయమునకై నిరీక్షించు చుండెను.

తరువాత రాయప్ప తప్పొప్పుకొనినాఁడు. నిజము నిలుకడమీఁద తేలినది. విడుదల ఉత్తరువు వచ్చినది. కాని అప్పటికే కరుణాకరుఁడు ఈలోకమును విడిచి పోయినాఁడు!

# తపాలకన్య

[ సౌరాష్ట్రదేశపు జాతీయగాథ. ]

కృష్ణపక్షమున నొక సాయంకాలము. భానుఁడు పడమటి ముఖము పట్టెను. అతని యడుగుల వెంబడి సందెచీఁకటి చొచ్చుకొని వచ్చుచుండెను. ఆకాశము మచ్చునకైన మచ్చు కనఁబడనంత నిర్మలముగ నుండెను. ఇప్పుడిప్పుడే అట నొకటి, ఇటనొకటి, చుక్కలు మింట మెఱయుచుండెను.

గ్రామస్థులు దైవసందర్శనమునకై ఆలయము చెంత వేచి యుండిరి. ఆటలే ఆనందముగ నెంచు అర్ధదిగంబరులైన బిడ్డలు గుంపులు గుంపులుగ ఆలయములో మూఁగుచుండిరి. వీరిలో రెండు పక్షము లేర్పడినవి: జయఘంట కొఱకు నొక పక్షమువారు; అది వాయించు సుత్తి కోసము రెండవ పక్షమువారును. అర్చకుఁడెంత త్వరలో దేవునకు నివేదనము చేయునా ! — తీర్థము,

బెల్లములో పొదిగిన కొబ్బెర ముక్కల ప్రసాదము, ఎంత త్వరితముగ దొరకునా ! — అను నాశతో చిన్న పిల్ల లమితోత్సాహమున గంతులు వేయుచుండిరి. కాని పూజారి—బావాజీ — ఇంకను నూతిదగ్గఱ స్నానము చేయుచుండుటచే, గుడి తలుపులు తెఱవనే లేదు. పెద్దలు తమ బిడ్డలతోకూడ 'దర్శనము' చేసికొని పోవుదమని ఆత్రముతో మండపమునొద్ద కనుపెట్టుకొని యుండిరి. అంతయు నిశ్శబ్దముగ నుండెను. అంతకంతకు చీఁకటి గాఢ మగుచుండెను.

ఒకాయన:—అబ్బ! నేఁటిసాయంకాల మదొక మోస్తరుగ నున్నది; ఏమియు తోఁచుటలేదు.

రెండవయతఁడు:- తోఁచకపోవుటయే కాదు, కనిపట్టితిరో లేదో కాని, సూర్యుని కాంతికూడ తగ్గి పోయినది !

మూఁడవయతఁడు:— కలియుగ మండీ ! బాబూ, కలియుగము !

'...............చూచినారా ? రానురాను, విగ్రహ మెంత తేజోవిహీన మగుచున్నదో! పది వత్సర

ముల క్రింద దానిచుట్టును వికాసవంతమగు నొక పరిధి వెలుఁగుచుండెడిది'—అని మఱి యొకాయన.

ఇవ్విధమున లోకాభిరామాయణ ప్రసంగములు సాగుచున్న సమయాన, ఒకఇంతిని వెంటఁబెట్టుకొని ఒకఁడు బజారునుండి ఈగుంపువైపునకు వచ్చుచుండెను. అతఁడు మొలను కత్తియు చేతను కఱ్ఱయు ధరించి యుండెను. ఆఁడుదానికి తలపై నొక మూట యుండెను.

వస్త్రులతీరును బట్టియు గమనమునుబట్టియు, వనిత రాజపుత్ర స్త్రీ యని స్పష్టమగుచుండెను గాని, బాహ్యవేషము పరికించినంతమాత్రాన, పురుషుఁడు ఎవఁడైనదియు గుర్తింప వీలుకాకుండెను.

ఇతఁ డాలయముకడ సమూహమును చూచియుఁ జూడనట్లు, తన దారిని తాను పోవుచుండెను. సహజోదారులగు ఊరివారు అతని నాఁపి, పలుకరించిరి. మౌనముతోఁ గూడిన తల యూఁపుతో నతఁడు మఱింత వడిగఁ బోఁ జొచ్చెను. అచ్చటి పెద్దలకు ఇతని యడావుడి వింతగ తోఁచినది. ఆతిథ్య మొసఁగుదమను అభిప్రాయముతో, మున్ను పరిచయములేని ఈ పథికుని నిలిపి, తిరుగ ప్రశ్నింపఁదొడంగిరి:—

వారు:— ఇక్లైంతదనుక ?

ఆతఁడు:— చాల దూరము.

వారు:—ఈరాత్రి కిక్కడ బస చేయరాదా?

ఆతఁడు:—(అనుమానముతోఁ గూడిన కోపముతో):—నన్నెంౘాలకు నిర్బంధింతురు ?

వారు:—మతేమియు లేదు. అసలే కటికి చీఁకటి. అందును, ఆఁడువారితో ప్రయాణము. ఎందుల కిబ్బంది పడెదరు ? మీకెట్టి అరమరయు నక్కఱలేదు. సోదరులము కద ! మా మాట లాలించి, ఈరాత్రి మా ఆతిథ్యము కైకొని, ఇట విశ్రమింపుఁడు.

ఇట్లు దయాళురగు నా జనులు బహువిధముల నొక్కి నొక్కి చెప్పిరి. గర్వశీలునకు ఈ లాలసవాక్యములు చెవి కెక్కునా ? నోరు క్రొవ్వియున్న ఆ పథికుఁ డిట్లు ప్రత్యుత్తరమిచ్చెను:—

'నా సమర్థతయు, బలాబలములును తెలిసియే ప్రయాణము చేయుచుంటినయ్యా ! ఇఁక, ఆలస్యము మాటయా? నాబోఁటి ధైర్యవంతుల కిది యేపాటి? నాకు సముఁ డెవ్వఁడును ఇంతవఱకు నాకంటఁ బడలేదు.'

అంత, గుంపులోనుండి యొకరు కోపముతో నిట్లనిరి:— 'పోనిండయ్యా ! కొమ్ములు తిరిగిన గొప్ప శూరుఁడుఁట !'

రాజపుత్రుఁ డా మాటలు సరకుసేయక, తన కాంతతో ముందఱికి సాగిపోయెను.

౨

ఇద్దఱును ఊరు దాఁటిరి. అదంతయు నిర్మానుష్యప్రదేశము. నిశ్శబ్దమగు చీఁకటి రాత్రియగుటఁ జేసి, మఱియు దిక్కుమాలిన స్థితిగ తోఁచెను. ఇట్టి ఘోరమగు చీఁకటిలో, అహంకారి యగు రాజపుత్రుఁడు త్రొక్కుకొని దారి తీయుచుండెను; పడఁతి ఆతనివెంట కాళ్లీడ్చుకొనుచుఁ బోవుచుండెను. కొంతదూర మేగుసరికి జేగంట మ్రోఁతలు వినవచ్చెను. ఊరి దీపములు గుడిసెలలో మినుకు మినుకు మనుచుండెను. చీఁకటిలో కుక్కలు మొఱుఁగుచుండెను.

హఠాత్తుగ మన పథికులకు గల గల మను శబ్దము వినఁబడినది. గర్విష్ఠుయైన రాజపుత్రుఁడు వెనుకకు తిరిగి చూడలేదు; కాని పడఁతుక అదేమి ధ్వనియో యని ఇట్టె తల త్రిప్పినది. త్రిప్పి, ఆశ్చర్యమందుటయేకాక,

అత్యంతానంద నిమగ్న యయ్యెను. ఏల ? ఆ వచ్చు చున్నది తనసొంత ఊరి తపాలారన్నరు. తలపై టపాసంచి; శబ్దము చేయుటకై 'రింగు' లున్న ఇనుపకఱ్ఱ చేతిలో; చినిఁగిపోవుచున్న ఒఱలో దోఁపిన కత్తి యొకటి—— ఇది రన్నరు వేషము. ఇతనిని ఆ దేశములో 'జతో' యని పిలు తురు. జతో నియమ ప్రకారము తన ధర్మములు నిర్వర్తింప చుకొనువాఁడు. ఉత్తరాలకోసము ఊరివారు ఆత్రము తో వేచియుందురని కాదు, ఇట్లుసేయుట ! టపా ఆలస్య మైనచో జీతము కోసివేయుదు రను భీతిచేతనే అతఁ డంత కచ్చితముగ గడియారమువలె పని చేయును. రాజపుత్ర స్త్రీని దాఁటి పోవుచున్న జతోనుజూచి ఆమె తన తలి దండ్రులను గుఱించిన కుశలప్రశ్నము లారంభించెను. ఆఁడుదానికి పుట్టినింటినుండి వచ్చిన క్రొత్తవాఁడయినను, సోదరునివలె అగపడును; అందుచేత, మాట పలుకు ఆడుకొనుచు, వారు పయనము సాగించిరి.

ముందునకు సాగిపోయిన రాజపుత్రుఁడు, భార్య ఎందుచేత వెనుకఁబడినదో యని అనుమానము తోఁచి, ఆక్షణమే వెనుకకు మరలెను —— ఏమది ! ఆఁడుదియా !! పరాయివానితో ప్రసంగించు

టయా !!!—ఉగ్రమూర్తియై, సతిని దబ దబ బాఁదు చు, అసామాన్యవాగ్ఝరితో నోటికి వచ్చినట్లెల్ల తిట్టిపోసినాఁడు.

'ఇతఁడు నాకు సోదరతుల్యుఁడు— మా ఊరి తపాల రన్నరు........' అనుచు తడఁబడు మాటలతో నామె చెప్పఁబోయెను.

'ఛీ ! నోరు మూయుము, నాకు తెలియును' అని రాజపుత్రుఁ డామెను కసరుచు, 'ఏమోయి, నీవు ప్రసంగించుచున్న దెవరితోడనో ఒడలు తెలిసి సంచరించుచుంటివా ?' అని తపాలా వానిని గద్దించెను.

'చిత్తము, చిత్తము !' అనుచు, జతో వెనుకకు తగ్గెను.

3

దుస్సాహసుఁడైన రాజపుత్రుఁడు తన సుందరితోఁ గూడ నొక ప్రదేశము చేరెను. అటుపైని రోడ్డు లేదు; సన్నని నాటుదారి మాత్రమే యున్నది. దీని కిరువైపులను దట్టమైన ముండ్లపొద లావరించి యుండినందున, మునుపటివలెఁ జొచ్చిపోవ వీలులేకుండెను. ఇట్టిస్థితిలోఁ గూడ, భయ మన నేమో యెఱుఁగని రాజపుత్రుఁడు కొంతదూ

రము త్రోసికొనిపోయెను. సగము దారిలోనికి వచ్చునరికి అమాంతముగ పండ్రెండుగురు బందిపోటు దొంగలు ముట్టడించిరి. ఎల్లరు నేకకంఠముతో, రాజపుత్రుని 'కత్తి క్రిందఁ బెట్టు' మని గద్దించిరి. పూర్ణాగ్రహావేశచిత్తుఁడై, రాజపుత్రుఁడు వే రేమియు చేయఁజాలక కొంతసేపు దూషించినాఁడు. దొంగ లతని కత్తి లాగికొని, అతనిని విఱిచికట్టి, దూరమున కీడ్చిరి.

'ఆభరణము లన్నియు నూడఁదీయు" మని, నిస్సహాయురాలగు రాజపుత్రి కాజ్ఞాపించిరి. ఒక టొకటిగ ఒలువ నారంభించినదా యిల్లాలు.

ఆమెనుకూడ ఎత్తుకొనిపోవుట కా క్రూరులు యత్నించు నంతలో జతోచేయు గలగల శబ్దము వినఁబడినది. ఆమె సంతోషమునకు మేరలేదు. 'మునిఁగిపోవుచున్నవానికి పూరిపుడక చేతికి దొరకినను మేలేకద !'

'సోదరా ! జతో! రక్షింపుము ! ననుఁ గాపాడుము !' అని యామె యొక్క కేక వేసినది.

కత్తిదూసి, కొదమసింగమువలె జతో, రంగమునఁ జొరఁబడినాఁడు. దొంగల యత్నములు భగ్నమైనవి. జతోను వారు కఱ్ఱలతో మోఁదినప్పటికిని,

అతఁడు మంచి సాము చేసినవాఁడు కనుక, ధైర్యముతో వారి దెబ్బలడాక కాఁగి, పోరఁగలిగెను. వారు పెక్కురు, ఇతఁ డొక్కఁడు ! అయినను, జతో కొందఱను హాత మార్చెను. లాటీ దెబ్బ లింకను తలపైఁ బడుచునే యున్నవి; కాని జతో వానిని సరకుగొనలేదు. అంతట రాజపుత్రి, సహాయముకొఱకు ఒక పెద్ద బొబ్బ పెట్టెను. ప్రాణములు దక్కించుకొనుటకు గుంపంతయు చెల్లాచె దరై పాఱిపోయిరి. జతోకు శక్తి యుడిగిపోయినది, ఇఁక బాధ భరింపఁజాలక, క్రిందఁ బడెను.

పిమ్మట రాజపుత్రి తన భర్తను విడిపించెను.

అతఁడు:— రమ్ము పోవుదము.

ఆమె:— ఎచ్చటకు పోవుట ? పిఱికిపందా ! సిగ్గులేదా ? ఒక్క నిమిషపు పరిచయమునకే, ఎట్టి సంబంధములేని ఇతఁడు తన ప్రాణములు నాకొఱ కర్పించెనే ! నీవు—నా జీవితేశుఁడవగు నీవు, నన్ను పేక్షించి, నీగొడవమాత్రము చూచుకొంటివి కద ! తుచ్ఛుఁడా ! నీ దారిని నీవు పొమ్ము. హంస యెక్కడ, కాకి యెక్కడ? రెండింటికిని సామరస్యమా ! నారక్షకునితో నేనును స్వర్గమునకుఁ బోయెదను.'

ఈ వాక్కులు ఆవేశబలమున ఆమె హృదయమునుండి అప్రయత్నముగ వెలువడినవి.

నిర్దయాత్ముకుఁడైన రాజపుత్రుఁడు 'నీకంటె అందకత్తెను పెండ్లియాడెదనులే' అని ప్రేలుచు ఆమెనా చీఁకటిలోనే విడిచి పోయెను.

ఆ యమ జతో శవము తనయొడి నిడుకొని రాత్రి యంతయు ఒంటరిగ నచ్చటనే జా గ ర ము చేసెను. ఉదయముననే చితిపేర్చి ముట్టించి, జతో శవముతోఁ దానందు ప్రవేశించెను. సాయంకాలమునకు కొన్ని బొగ్గులును బుగ్గియు తప్ప, మఱేమియుఁ గాన రాదయ్యెను.

*  *  *  *  *

స్త్రీ మాన ప్రాణ సంరక్షణార్థమై ఏ స్థలమున జతో తన ప్రాణము లర్పించెనో, ఎచ్చోట రాజపుత్రి కృతజ్ఞతా సూచకముగ రక్షకునితో తన యసువుల నాహుతిచేసి పరమధన్య యయ్యెనో, ఆ పవిత్ర ప్రదేశమున—తపాలరన్నరు జతో జ్ఞాపకార్థమై ఒక సమాధియును, రాజపుత్రి స్మారక చిహ్నముగ, ఱాతితో చెక్కఁబడిన నొక స్త్రీహస్తమును, నెలకొల్పఁబడి నేఁటికిని నిలచి యున్నవి.

# జగన్నాటకము

మిక్కిలి భయంకరమగు తుపాను. వాయు దేవుఁడు యావచ్ఛక్తియు వినియోగించి పెద పెద్ద కెర టములు కల్పించుచుండెను. సముద్రుఁడు వెలిగ్రక్కు నురుగులో సగము సగము మునిఁగియున్న ఱాతిగుట్టలు స్నాన మొనరించుచుండెను. కనుచూపుమేరలో ఒక యోడ అతివేగమున పయనము సాగించుచున్నట్లు కాన వచ్చినది. పడవ కుండియున్న సామగ్రి యాతయు సము ద్రుఁడు పొట్టను బెట్టుకొన్నట్టు తోఁచెడిని. శల్యావశిష్టమై గ్రుక్కియున్న ఈ స్వరూపము అలలుపొంగినపుడెల్ల ప్రక్క యొరఁగుతో పైకి లేచుచు, అవి క్రుంగినపుడెల్ల దబ్బున దిగఁబడుచు, రాను రాను తరంగపు దెబ్బల బాధ మిక్కుటమైనందున సహింపఁజాలక ఒక ఱాతి గుట్టను దగులొ్కని శిథిలమయ్యెను. అచ్చటనే శైల

శిఖరమున వసించుచుండిన ముని యొకఁడు ఈ దుర్భర దృశ్యము వీక్షించి 'పరమేశ్వరా ! కరుణింపుము, కరుణింపుము !' అనుచు కేక లిడసాగెను. ఈతని యఱపులు నిరర్థకము లయ్యెను. ఓడకు ఆయుస్సు చెల్లిన కారణమున ఒక ప్రక్క కొరఁగి సముద్రునిలో నైక్యమయ్యెను.

త్వరలోనే ఒక నల్లని ఆకారము గుట్టల వైపునుండి సముద్ర తీరమునకు వచ్చుచున్నట్లు కనఁబడినది. తొలుత స్వరూపము పోలిక దొరకలేదు. పిమ్మట నురుగు అడ్డముగా నుండుటచే మసక మసకగా కన్పడినది. కెరటముతో కూడ పైకి తేలినపుడు దాని రూపము ప్రస్ఫుటముగ బయల్పడినది. మఱల నిట్టె మఱుఁగు పడినది. దరికి సమీపింపఁగా అది ప్రాణములఁ దక్కించుకొన తికమకలు పడుచున్న జనముతో నిండియున్న ఒక చిన్న పడవ యని స్పష్టపడినది. ముని ఒడ్డునకు తొందరగా వచ్చి, మనస్సంక్షోభితమగు ఆశా భయములతో దాని రాక గమనించుచుండెను. ఎట్టకేలకు సముద్రుఁడు ఒక్క తీవ్రమైన ఉసురుతో పడవను ఒడ్డునకు కొట్టివేసినాఁడు. తడిసి ముద్దలయి సగము చచ్చియున్న ఆ నావికులు మెల్లగ ప్రాఁకి వచ్చి భూమిపైఁ బడినారు.

ముని వీరలఁ తన గుహాకు తోడ్కొని పోయి ముందు కాచుకొనుటకు అగ్గి నమర్చి, పిమ్మట తనకుఁ గలిగిన దానితో ఆతిథ్య మొసఁగి, వారి మునుపటి బలమును ఉత్సాహామును పునరుజ్జీవింపఁ జేసెను.

ముని:— అయితే మీ ఆర్గురు మాత్రమేనా ప్రాణములు దక్కించు కొనఁగలిగినది ?

వారిలో నొకఁడు:— అవును. ఓడలో ఆ బాలగోపాలము డెబ్బదియైనుమంది ఉంటిమి. బాబూ ! మునిఁగిపోవు సమయమున ఏమి ఘోష ! ఏమి కలవరము ! పతుల మెడలు పట్టుకొని వ్రేలాడు సతులు, తల్లుల చీర చెంగులు పట్టుకొని వ్రేలాడు శిశువులును ! రోదనలు— వేదనలు—ప్రార్థనలు — దీనాలాపములు !! 'ఉఁ' అనుట కవకాశ మెక్కడ ? 'కప్తాను' ప్రజల గోడవ చూచుచునే యున్నాఁడు. ఈ చిన్న పడవ దొరకఁగా అతనితో చెప్పకుండనే త్రాళ్ళు తెంపుకొని చిటుకలో దూఁకినాము. దూఁకుటయే తడవుగ ఓడ గంగార్పణ మైనది. మేము మాత్రము ఎటులనో బ్రతికి వచ్చి ఇట నిట్లు కులాసాగా నున్నారము.

వీరి వచనములకు ముని విషణ్ణుఁ డైనాఁడు. 'దైవమా ! ఇట్టి పాపిష్ఠులకు బదులుగ కొందఱు సన్మార్గుల ప్రాణములు దక్కింప లేకపోతివా ? ' అను తలంపు మనస్సులోఁ జొరకుండ చేసికొన లేకపోయినాఁడు.

ఈ యవస్థలో నావికులకు వలయునదేదో లభ్యమైనది. 'అన్నదాత సుఖీభవ !' అనియైననోట నుచ్చరింపకయే ఆ కృతఘ్నులు వారి దారి వారు పట్టి, దేశము ప్రవేశించిరి. చీఁకటి పడినది. కొంత దూరమున వెలుఁగు కనఁబడఁగా అక్కడ చేరుకొనిరి. అది యొక తోఁట. అందొక రమ్యమగు భవనము. ఈ ద్రోహులు తలుపు తట్టి ఇంటివారితో తమ యవస్థ వెలిబుచ్చి 'ఆదరింపుఁ' డని వేఁడుకొనిరి. కరుణామయులగు ఆ గృహస్థులు వీరల నుచితరీతిని సత్కరించిరి.

యజమానుఁ డింట లేఁడు. ఇంటియాపె, బిడ్డలు, పరిచారకులు, ఒక వయోవృద్ధు, కుట్టుఁడును అటనున్నవారు. నిప్పుకడ చలి కాచుకొనుచుండఁగా నావికులకు ఒక దురాలోచన పొడమినది: ఈ యిల్లు కొల్లఁగొట్టినచో శ్రమమునకుఁ దగిన ఫల ముండుననియు అందుల కిదియే మంచి తరుణమనియును. ఒకరితో

నౌకరు కూడబలుకుకొనినపిమ్మట తమ పన్నుగడ తత్క్షణమే ఆచరణమునకుఁ దెచ్చుటకు కృతనిశ్చయులైరి.

అంతట—ఇంటిలోని వృద్ధు కట్టెలు తెచ్చుటకు వెడలఁగా అం దొకఁడు ఆతని తలపై చేనున్న ఇనుపకోలతో నొక్క వ్రేటువేసి దివి కంపెను. మఱొకఁడు పాఱిపోవ నుద్యుక్తుఁడైయున్న కుఱ్ఱవానిని తఱిమి తఱిమి కత్తి దూసి గుండెలో పొడిచినాఁడు. మిగిలినవారు తలుపులన్నియు గడియవైచి స్త్రీలను పిల్లలను విఱిచికట్టి మాటరాకుండ నోట గుడ్డలు క్రుక్కి ఇల్లు గాలింప మొదలిడిరి. అందొక బిడ్డఁడు భయకంపితుఁడై పీల గొంతుతో నఱచుచుండ దొంగలలో నొకఁడు వెళ్ళి పీక నులిమివైచెను. ఒక్కొక్కఁడు విలువగల సామానులు మోయఁజాలినన్ని మూటఁగట్టుకొని ఇల్లు దాటిపోవ సంసిద్ధులుగ నుండిరి.

ఇంతలో యజమానుఁడు ఇల్లు చేరినాఁడు. ఇతఁడు భూస్వామి. నిషిద్ధ వస్తువులు ఎగుమతి దిగుమతి చేయు రహస్య వ్యాపారముకూడ సాగించును. నాఁడు సేకరించిన సామగ్రి ప్రక్క యింటిలో మిత్రుల యధీనము గావించి ఇదియే వచ్చుట ఇంటికి.

## జ గ న్నా ట క ము

తలుపులు బిగింపఁబడి యుండుటకు విస్మితుఁడై గదులలో వెలుఁగు ఇటునటు పోవుచుండుటఁ గని ఏదియో విపరీత మున్నదని శంకించినాఁడు; అట్లే ఒక్క నిమిషము నిదానించినాఁడు, క్రొత్త గొంతుకల గుసగుసలు వినవచ్చినవి; కిటికీ సందుల గుండా పరికించి చూచినాఁడు, పరాయి మొగము లగపడినవి. తత్క్షణమే పరువెత్తిపోయి తా నప్పుడే విడిచివచ్చిన మిత్రబృందమును వెంటఁ గొనివచ్చినాఁడు. దొంగలు తలుపులు తెఱచుకొని మూటలతో నొక్కొక్కరుగ నీవలఁ బడజొచ్చిరి. వీరు దొంగతనముతోను హత్యలతోను ఊరకుండిరా! దుష్కృత్యములు కప్పిపుచ్చుటకై కొంపకు చిచ్చుకూడ తగిలించిరి.

ఇంటియజమానుఁడు తన జట్టుసాయముతో వారినందఱను పట్టుకొనినాఁడు. ఇంటిలోని అగ్నిజ్వాలఁ జల్లార్పఁబనిచినాఁడు. మఱునాఁడు లోకులెల్లరును 'చీ!చీ!' యనుచుండ దుష్ట నావికులు 'జైలు' నలంకరించినారు.

ఈ యుదంతము మన ముని చెవులఁబడగా– "ఓహో! దైవ సంకల్ప మెంత చిత్రము! దుష్టశిక్షణమునకును శిష్ట రక్షణమునకును కంకణము కట్టు

కొని యున్నాఁడు ఆ పరమేశ్వరుఁడు !" అనుకొనుచు ఆశ్చర్యపడి ఒకింతసేపుండి ఇటు లాలోచింపఁగడంగెను: "ఈ దుర్మార్గు లిట్టి నష్టకార్యములు చేయకుండ సముద్రములోనే మునిఁగి చచ్చియుండరాదా ! వీరికి బదులు ఓడలోని మఱికొందరు సన్మార్గులు బ్రదుకుట మేలుగద! అటులైన ఇచ్చట మూఁడు అమాయికపు ప్రాణులు దక్కియుండెడివే ! ఆసంగతి యటుంచి— యజమానుఁడు శాసనవిరుద్ధమైన వ్యాపారము తెగించి సాగించుట ఇట మంచిగనే పరిణమించినది. అతఁ డింటియొద్దనే ఉన్నచో తన కుటుంబముతో పాటు హతుఁడై యుండును; దుర్మార్గులకు స్వేచ్ఛయు నవకాశమును ఎక్కుడుగ నుండెడిది. ఇదంతయుఁ జూడ దైవనిర్ణయముల నే మనుకొనుటకును వలను గాకున్నది !"—ఇట్టి సంశయ కలితమగు ధ్యానములో మునిఁగి చింతాక్రాంతుఁడై, అలసి అట్టె తలవ్రాల్చి కనుమూసినాఁడు. నిద్దుర ముంచుకొని వచ్చినది, ఆనిద్దురలో నతఁ డిట్లొక కల గాంచినాఁడు:

తాను శైలశిఖరమున ఆసీనుఁడై యుండెను. తెల్లని దుస్తులు ధరించిన ఒక దివ్యసుందర విగ్రహుఁ

డీయనకు సందర్శన మిచ్చి "ఏమయ్యా ! నీ వదన మిటు లున్న దేమి ? నీ కించుకు హేతు వెయ్యది ?" అని పలుకరించెను.

ముని:—మహానుభావా ! నీతి విజ్ఞానముల గుఱించిన నా భావములు భగవదాజ్ఞలతో సమన్వయించుకొన లేకున్నాను. ఇదియే నా సంతాప కారణము.

అతఁడు:—సృష్టి విధానములఁ గూర్చిన నీ యూహాలు సంకుచితములై యున్నవి, నీవు పొరఁబడుచున్నావు. పరిపాలనము నంతను పరిశీలింపఁజాలక నీ దృష్టిపథము ప్రత్యేకాంశములపై మాత్రమె ప్రసరించిన కారణముననే ఈ చిక్కు. ప్రపంచ సంభవము లన్నియు దైవ నిర్ణీతములే. జగన్నాటక సూత్రధారుఁడు అఖండ విజ్ఞాన భూయిష్ఠమగు తన నియమములచే ప్రాణికోటి కంతకును మేలు చేకూర్చును. స్వల్పలాభముల పాటించి వ్యక్తిగతముగ విషయములు విమర్శింపఁ బూనితి మేని అది తప్పక భ్రమ ప్రమాదములకు దారి తీయును— నాతో ఈ శిఖరాగ్రమునకు రమ్ము.

ముని ఆతని వెంట ఎత్తయిన ఆ గిరి శిఖరమునకుఁ బోయెను.

అతఁడు:—క్రిందికిఁ జూచి- నీ కే మగపడు చున్నదో చెప్పుము.

ముని:—ఒక డేగ చిన్నపక్షుల సమూహ మును వెంటాఁడుచున్నది. అం దొకటి దానికిఁ జిక్కినది; మిగిలినవి పాఱిపోయినవి.

అతఁడు:—ఒక్క సంగతి ఆలోచించుకొ నుము. ఇపు డా పట్టువడిన పిట్టమీఁద దేవునకు కోప మును పాఱిపోయిన వానిపై దయయు ననుకొంటివా ! - అటులు కాఁజాలదు. బ్రతికియున్న చిన్నజీవులను ఆహార ముగ గొనుట డేగలకు సహజస్వభావము. అంగుల కనువగు బలమును, త్వరిత గమనమును ప్రసాదింపఁబడి యుండుటచే అవి పిట్టలను సుకరముగ వేటాఁడ గలవు. ఇవ్విధమున ప్రాణులను రక్షించుటకే ప్రాణము లర్పింపఁ బడుచున్నవి. కాని—ఈ లయమునకుఁ గూడ కొన్ని హద్దు లేర్పడియున్నవి. వేటాడు పక్షులకంటె చిన్న పిట్ట లసంఖ్యాకములు. వాని శక్తి నివి ఎదిరింపఁజాలక పోయినను శత్రుబారినుండి తప్పించుకొను సామర్థ్య మును, లాఘవముతో నెగురు శక్తియుఁ గలిగియున్నవి. ఇట్టి సమదృష్టిలోనే పరమేశ్వరుని విజ్ఞానము లగ్నమై

యున్నది. ఇంతకంటెను విచిత్రము సహజపరస్పర వైరు లగు ఈ రెండును ఒక్కచో జీవించుట !

సరే, మరల అటు చూచి నీ కేమి గోచరించునో తెల్పుము.

ముని:—దట్టమగు నల్లని మేఘము ఆకాశమునఁ గూడుకొనుచున్నది. ఆ యంధకారావరణమునుండి ఎఱ్ఱని మెఱుపు మెఱసినది. గొప్ప ధ్వనితో పిడుగు వెలువడినది. అది పోయి ఒక వృక్షరాజముపైఁ బడి దానిని తుత్తునియలు గావించినది. పాపము! చెట్టుక్రింద విశ్రాంతిఁ బొందుచున్న ఎద్దును కూడ ఈ పిడుగు కూల్చినది. అయ్యో! అంతటితో నుపశమింపలేదు. బయలున నున్న గొఱ్ఱెలమందపై గూడ పడి కొన్నిటిని బరిమార్చినది. కాపరి కూడ మడసినాఁడే పాపము! అయ్యయ్యయ్యో, దిక్కుమాలిన పిడుగున కింకను ఆఁకలి తీరలేదు! ఘనమైన ఆ దేవాలయ గోపురమును డీకొని నేలమట్టము చేసినది. ప్రక్కనున్న పూరిండ్లకు చిచ్చుపెట్టినదాఁక దానికి శాంతికలుగ లేదు. అబ్బా! ఈ ఘోరదృశ్యము దుర్భరముగ నున్నది.

అతఁడు:— అదే సృష్టి రహస్యము ! దీనిఁ బట్టి నీవేమి గ్రహించితివి ? చెప్పెద, వినుము: పంచ మహాభూతములలో నొకటి యగు అగ్ని ప్రాణికోటిలో కదలిక పుట్టించుచున్నది. ఇదియే విద్యుచ్ఛక్తికి ఉత్పత్తి స్థానము. ఈ విద్యుచ్ఛక్తి మేఘమండలమును తాఁకిన పుడు అం దినుమడింప నెక్కుడుగ నున్న యుష్ణము 'పిడుగు' రూపమున భూపతన మగుచున్నది.

ఇ ప్పు డు—

'అయ్యో ! ఇట్టి పవిత్రవంతమగు దేవుని గోపురము మీఁద పడవచ్చునా ?' యను శంకతో తన దారి మరల్చుకొని పిడుగు చెట్టుపైనే పడునా ? తన యుగ్రత మందపై వినియోగ పఱచి కాపరిని వదలిపె ట్టునా ? ఈ మహాభూతము వలననేకదా కోటానకోట్లు జన్మించుట ! కొలఁది ప్రాణులు సమయుచో అది యొక లెక్కయా ! భూములు సారవంత మగుటకై కొండల నుండి నదులు ప్రవహించునపుడు మానవనిర్మితములగు కొన్ని కట్టడములు భగ్నమగును; అప్పట్టున మనుజులే విధ్వంసము కావచ్చును. పోనీ, ఈనష్టము లేకుండ ఇట్టి

లాభము మనము పొందఁగల వేఱు సాధన మేదైన ఉన్నదా ?

ముని:—మహాశయా ! తమ ప్రబోధమును గ్రహించితిని కాని, నిన్నను జరిగిన విషాద వృత్తాంతములఁ గూర్చి యేమనెదరు ? ఒక మనుజుని మఱియొకని బాధకు గుఱి చేయనేల ? దుష్టుల క్షేమమునకై శిష్టులఁ జంపనేల ? దీని వలనఁ గలుగు లాభమేమి ?

అతఁడు:—ఇదికూడ ఆ జ్ఞానమయుని విచిత్ర పరిపాలనా ఫలమే. మానవుని అభ్యాసలోలునిగ పరిగణించుటయే సమంజసమైనచో 'కప్తాను' కే నావికులకంటె ప్రాణసంరక్షణ మొనరించుకొను నవకాశము మెండు, కాని తన ప్రాణములకొఱకతఁడు పెనఁగులాడ లేదు. ఎందుచేత ? 'స్వార్థము' అను అలవాటునకు కొన్ని నియమము లేర్పఱచుకొన్నందున. దాననే ధీరుఁడైనాఁడు. ఇఁక నావికులన్ననో, అట్టి నియమములు లేని కారణముననే దొంగలుగను హంతకులుగను మాఱినారు. మానవుని స్వార్థపరత్వము వలన కలుగుచుండు కీడును ఆటంకపఱచుట దుష్కరము ; కాని, ఇట్టి బాధలు నివారించుటకే చట్టములు వినియోగింపఁబడు

చుండును. ఎప్పటికైనను 'ధర్మము గెలుచును, అధర్మము పిడుగు.' ఇది శిలాక్షరమే.

నాయనా ! పాపులకు ఇచ్చట కాకపోయిన మఱొక లోకమునన్నైన దైవము తగిన ప్రాయశ్చిత్తము చేయకుండ వదలునని తలంపకుము.

కనుక ఇపుడు—

వ్యక్తిగతమగు విషయముల నీ మనస్సులో చొరనీయకుము ; విషయములు సంపూర్ణముగ పరిశీలించి నపుడు మొత్తముమీఁద నవి ఎల్లర మేలుకొఱకు ఏర్పడియుండునని నమ్ముము. భగవంతుఁడు ప్రత్యేక విషయములలో జోక్యము కలుగఁజేసికొనలేదే యని చింతింపకుము; సమయానుకూలముగ నీవు దానిని గ్రహింపఁ గలుగుదువు. ఒక ఈఁగ చనిపోవునేమో యను భీతిచే కాలచక్రము నాఁపి వేయఁ దగునా? ఎన్నియో ప్రాణులు ప్రతిక్షణము నాశనమగుచున్నను పాటింపక పరమేశ్వరుని ధర్మ పరిపాలనములో తోడ్పడుటకై కాల చక్రము తిరుగుచునే యుండును. మున్ముందుకూడ జరుగఁదలఁచిన క్రమము నిదియే !

# దైవబలము — మానవబలము

[ మహారాష్ట్ర జాతీయగాథ. ]

నిన్నకాదు మొన్నకాదు, కొన్నివేల వత్సరముల క్రిందటి మాట; నిశా సమయమున పార్వతీ పరమేశ్వరులు విమానయానము సల్పి, శరణార్థులను సముచితరీతిని బహూకరింపుచుండెడి యప్పటి గాథ. ఇప్పటి యంత దుష్కాలము కాదది. ఇంత బహుళముగ పాపిష్ఠులు కానరారు, సజ్జనులు పెక్కురు. ఇక్కట్టుల ననుభవించుచున్న కొలదిఁమందియైనను కోరినంత మాత్రమున దైవకృపకు పాత్రులగుచుండిరి. అట్టి కాలములో—

ఒక యూర నొక బ్రాహ్మణుఁడు కలఁడు. అంధుఁడు. గాఢమగు ఈశ్వరభక్తుఁడు. శాంతయుతుఁడు. కడుబీదయైనను కలిగినదానితో తృప్తిచెందువాఁడు. సతీమణి గాక మువ్వురు పుత్రులు ఒకపుత్రిక గల కుటుంబ

మును అతఁడు భరింపవలసియుండెను. ఊరిచివర నున్న ఆలయములో యాచనావృత్తిచే ఈ పెద్దసంసారమును కష్టముతో పోషించుచుండెను. అతని భార్య ఉత్తము రాలు. భర్త గ్రుడ్డివాఁడైనను పేదస్థితిలో నున్నను నిర సింపక అతనిఁ బ్రేమించి ఎల్లవిధముల తోడునీడయై యుండెను. ప్రత్యూదయమునను భర్తను దేవాలయములో దిగఁబెట్టును. అచ్చట బ్రాహ్మణుఁడు పఱచిన తువాలు గుడ్డమీఁద యాత్రికులు తమకు తోచినది—బియ్యమో, పండ్లో, రొక్కమో—వేసి పోవుచుందురు. ఆమె సాయం కాలము వచ్చి అతనినింటికిఁ గొంపోవును. ఆమెకు వీలు పడనివేళలందు పిల్లలను పంపుచుండును. వీరి దారిద్ర్య మునకు తోడు సకాలమునకు అద్దె చెల్లింపలేనపుడెల్ల ఇంటి యజమానుఁడగు చండశాసన వైశ్యశిఖామణిగారి బెదరింపులు నిర్దయాత్మకమగు దూషణములును తప్ప కుండెను. భార్యాభర్తలు రాత్రులందు తమ దురవస్థలను పరస్పరము వెలిపుచ్చుకొనుచుందురు. ఒకప్పుడు బ్రాహ్మ ణుఁడామెను ఇటు లోదార్పఁ జొచ్చెను: 'కుఱ్ఱవాండ్రకు ఉపనయన మయిన తోడనే మన కష్టములు గట్టెక్కును. అపుడు వారు భిక్షమెత్తుకొన నర్హులయి సంపాదనము

నకుఁ గడంగవచ్చును. అదియుఁగాక పిల్లకు పెండ్లి అయినతోడనే ఆమె బాధ్యతకూడ మనకు వదలును.' ఈ వచనముల కామె సంతసించినది. చీఁకటిరాత్రుల తర్వాత వెన్నెల రాత్రులు రాకపోవునా యని ఉభయులును దైవమునే నమ్మియుండిరి.

ఇట్లుండ ఒక దినమున — దీపాలవేళయైనను బ్రాహ్మణుని ఇంటికిఁ జేర్చుట కెవ్వరును రారైరి. అతనికి ఆతురత హెచ్చెను. కొంతసేపటికి తన సతి వచ్చినది, కాని వెక్కి వెక్కి ఏడ్చుచుండెను. కారణ మేమన? ఇంటి యజమానుఁడు పంపిన 'అపరనక్షత్రకుఁ'డగు సేవకుఁడు బ్రాహ్మణుని భార్యను పిల్లలను పలువిధముల బాధించెను. వారి కుండియున్న కొలఁది పరికరములను, పప్పు బియ్యము మొదలగు తినుబండములను, వీధిలో విరజిమ్మి విసరివైచెను. అద్దె చెల్లింపకున్న ఒక్క నిమిషమైనను పంచక్రింద నుండవలదని శాసించెను. బ్రాహ్మణుఁడు కథయంతయు వినినాఁడు. చేయుట కేమున్నది? ఆమెతో కూడ అతఁడును దుఃఖింపనారంభించెను.

ఈ సమయమున పార్వతీపరమేశ్వరులు ఆకాశమార్గమునఁ బోవుచుండిరి. పేదదంపతుల దుర్భరపరితా

పమును గాంచి పార్వతి " ప్రాణేశా ! అంధుఁడగు మీ భక్తుఁడు నిస్సహాయుఁడై ఎట్లు దుఃఖించుచున్నాఁడో చూడుఁడు. దయలేదా ? నావిన్నపమాలించి అతనిని బాధావిముక్తుని జేయుఁడు. వారి రోదనము వినఁజాలకున్నాను. రేపటికి అతఁడొక లక్షాధికారి యగునట్లు అనుగ్రహింపవలెను. "

పర:-ప్రేయసీ! అతఁడు తాఁజేసికొనిన కర్మము ననుభవించుచున్నాఁడు. కలిమి లేములు కావడికుండలు. త్వరగానే అతనికి అదృష్టదినములు బయల్పడఁగలవు.

పార్వ:—ఆ యదృష్ట మిప్పుడే బ్రసాదింపుఁడని నా కోరిక.

పర:—అటులే కానిమ్ము, నీ యభీష్టము నెఱవేఱునుగాక !

ఇట్టి సందర్భములో ఇంటియజమానియగు మన వైశ్యప్రముఖుఁడు దేవసందర్శనమునకై ఆలయమున కేతెంచి, పూజారికొఱకు నిరీక్షించుచుండెను అంత విగ్రహము లీ క్రిందితీరున మాటాడుకొనినట్లు లోపల నుండి వినవచ్చినది.

"నాయనా, గణేశా!"

"ఏమి తండ్రీ!"

"ఈ ఆలయమునకు అనుదినమును వచ్చుచున్న అంధబ్రాహ్మణునికి రేపు సాయంకాలము లోపల ఒక లక్షరూపాయ లిమ్ము ఏమి?"

"అటులే, తప్పక."

ఈ ప్రసంగమంతయు స్పష్టముగ ప్రతిఅక్షరమును కోమటి చెవులలో ప్రతిధ్వనించెను. అందుచే గణపతి పరమేశ్వరుల సంభాషణము అతనికి మిక్కిలి నమ్మకము పుట్టించెను.

అతడు దైవప్రార్థన త్వరితముగ ముగించి ఇంటికి మరలెను. అర్ధరాత్రమున బ్రాహ్మణుని కడకు పోయి ఇటులనెను:— "బాబాజీ! నా సేవకుడు మిమ్ము తూలనాడి ఇబ్బంది చేసెనట; అందులకు నే నెంతో పరితపించుచున్నాను. ప్రపంచములో నిట్టి పశుప్రాయులు కొందరుందురు. అది నా తప్పుగా భావించి క్షమింపవేడెదను. తమవంటి ఉత్తమ బ్రాహ్మణులకు పాపము! అంధత్వము సంప్రాప్తమైనది. తమ ఈ దురవస్థకు మనస్సులో నే నెంత ఖేదపడుచున్నానో దేవునకే

ఎఱుక; అద్దైవిషయమై ఆవంతయుఁ జింతింపవలదు. మీచిత్తము వచ్చినంత కాల ముండుఁడు. బ్రాహ్మణాస త్కారమేకదా దైవపూజ! ఇదిగో, ఈ పదిరూకలను దయతో స్వీకరించి ఆశీర్వాద మనుగ్రహింపుఁడు. కాని ఒక చిన్న విన్నపము. ఇందుకు మఱొక విధముగ భావింపరనియే నమ్మిక. రేపటి దినమున ఉదయమునుండి సాయంత్రము వఱకు ఆలయములోని తమ సంపాద్యము మాత్రము నాకు ప్రసాదింపవలెను."

ఈప్రార్థనకు ముసలి బ్రాహ్మణుఁ డించుక విస్మయమందినాఁడు. గర్భదరిద్రుఁడైనందున పది రూపాయలును మహాభాగ్య మనిపించినది. కాని ఆలోచించి, మఱునాటి తన యాచనాభాగ్యము విక్రయించుట కియ్యకొనలేదు.

కోమటి:—కాదు బాబాజీ! తొందరపడకుము. అంతగా వలయునేని నూఱు రూపాయలు గైకొనుము. రేపటి నీ ఆర్జనము మాత్రమే నే కోరునది.

బ్రాహ్మణుఁడీ బేరమున కిష్టపడలేదు, కోమటి అతనిని వదలుటలేదు. క్రమముగా పాట రు. 75000 ల వఱకు పెరిఁగినది. అప్పటికిని బ్రాహ్మణుఁడు ఒప్పుకొన

లేదు. కాని ఈ సంభాషణ మాలకించుచున్న బ్రాహ్మ ణుని భార్య ఇంతలో వచ్చి ఇట్లు లనెను:— "సెట్టి గారూ! రు. 75000 లును తీసికొనిరండు, నాభర్త చే ఎట్టులయిన ఒప్పించెదను." ఆమె ప్రోద్బలముచే కడకు బ్రాహ్మణుఁ డంగీకరించెను. తత్‌క్షణమే కోమటి ఇం టికిఁ బోయి రు. 75000 లును సంచులతో తెచ్చి బ్రా హ్మణుని స్వాధీనము చేసె, ఇంకను రు. 25000 లు లాభ మున్నది గదా యని అపరిమితోత్సాహముతో నిలు చేరెను.

ఉదయమైనది. మామూలుప్రకారము బ్రా హ్మణుఁ డాలయములో పద్మాసనము వైచుకొని ముం దఱ తువ్వాలు పఱచుకొని కూర్చుండెను. కోమటి ఇత నిని కనుపెట్టి చూచుచుండెను. మధ్యాహ్నమైనది. కొన్ని దమ్మిడీకాసులు బియ్యము వివిధములగు కూరలు- ఇవియే బ్రాహ్మణుని యాచనావస్త్రముపై కానఁబడు చున్న ఆస్తి. కోమటి ఆత్రముతో నిరీక్షించుచుండెను. ఇంకను ఒక పూఁట యున్నదిగదా! ఏమిభాగ్యము రానున్నదోయని తలపోయుచుండెను. దేవుని వాగ్దత్తము చెవులార స్పష్టముగ వింటినే, అది వ్యర్థమ

గునా? అని తనలోతాను వితర్కించుకొను చుండెను. సాయంకాలమగునప్పటికిఁగూడ తనయాశ నెఱవేఱునట్లు తోఁచలేదు, ఓరిమి తగ్గుచుండెను. అవసరమైనచో సాయంకాలమైన తరువాత కూడ మఱి కొంతసేపు ఉండవలసివచ్చునని బ్రాహ్మణునితో నొక్కి చెప్పఁగా అతఁడందులకు సమ్మతించెను. గంటసేపైనది, మఱియొక గంట, మఱియొక గంట గడచినది. ఏ విధమగు రాబడియు కానరాలేదు. చీఁకటి పడినది. కోమటి రోషపూరితుఁడై గబగబ తిన్నగా గణపతి విగ్రహము నొద్దకుఁబోయి బెదరించుచు తుండము పట్టుకొని, "బ్రాహ్మణునికి వాగ్దానముచేసిన లక్ష రూపాయలేవి? అతఁడెంత బాధపడుచున్నాఁడో తెలియునా? నీవు దేవుడవే అయినచో మాట చెల్లించుకొనవలదా? ఏమి? వినబడుట లేదా? "అనుచు తుండము లాగఁబోయెను. అపు డతఁడాశ్చర్యపడునట్లు తనచేయి గణపతి తొండములో ఇరుకుకొనిపోయెను. సెట్టిగారు పట్టు వదలించుకొనుటకై లాగి విదిలించి అనేకవిధములఁ బ్రయత్నించెను. కాని ఇసుమంతయు లాభము లేకపోయెను, మనస్సున ఒక విధమగు జడుపు కలిగెను. "మహాప్రభూ! వేయి

కొబ్బరికాయ లభిషేకము చేసెదను, చెయ్యి వదలుము దేవుఁడా !" అని బహుభంగుల మ్రొక్కెను. స్థితి మాఱ లేదు. అంతట మునుపటి విధముగ విగ్రహము లిటులు సంభాషించుకొనుట వినవచ్చెను:

పర:— బ్రాహ్మణునకు లక్షరూపాయిలు ఇచ్చితివా ?

గణ:— చిత్తము నాయనగారూ ! నిన్నటి రాత్రి డెబ్బదియైదువేల రూపాయలిచ్చితిని. మిగిలిన సొమ్ము ఇచ్చు ప్రయత్నములో నున్నాను. కోమటి ఇరువదియైదు వేలును ఆ బ్రాహ్మణు నింటికి పంపిననే వదలెదను, లేకున్న పట్టు విడువను.

తనకు సంభవించిన దుర్భరస్థితిని గాంచి సెట్టి తత్క్షణమే రూ. 25000 లును బ్రాహ్మణునకు చేరు ఏర్పాటు గావించెను. ఈపని జరిగినదే తడవుగ నతని చేయి ఊడివచ్చినది. చేయునదిలేక, హతాశుడై విచారముతో నతఁ డింటికి మరలెను.

స్వహస్తములతో దేవుఁ డెవ్వరికిని ధనము ప్రసాదింపఁడు, ఒకరిచేత మఱియొకని కిప్పించును. ఆ ఇచ్చుటలోకూడ సగముసగము కాకుండ పూర్తిగా తన

వాగ్దానము నెఱవేర్చెను. పార్వతీపరమేశ్వరులా బ్రాహ్మణునకును అతనికుటుంబమునకును సకలసంపదలొసంగుటయేగాక అతనికి దృష్టికూడ అనుగ్రహించిరి. వారెల్లరును భక్తియుతులై సుఖముగ జీవయాత్ర గడుపసాగిరి.

---

ఈ కథలకు ఆధారములగు మాతృకుల కృతజ్ఞతా పూర్వకముగ పేర్కొనఁబడుచున్నవి:—

| | | |
|---|---|---|
| ౧, ౪ | ... | టాల్‌స్టాయి |
| ౨, ౫ | ... | శ్రీ ఎస్. ఎం. జోషి |
| ౩ | ... | విజ్ఞాన తరంగిణి |
| ౬ | ... | జువెనిల్ బడ్జెటు |
| ౭ | ... | శ్రీ జి. కృష్ణరావు |

# ఆంధ్ర సేవా ప్రసూనము:

"ఇవి యిట్టివని యొకరు వ్రాయుటయుఁ గొంతమంది యా వ్రాతఁ జదివి యంతతోఁ దృప్తిపడి యూరకొనుటయుఁ గాదు. ప్రతివారును జదివి తీరవలెను. ఇట్టి కథలను జదువుటయే నిజమైన చదువు. పరమ ప్రశాంతభావముతో నీతినిఁ దలకెక్కించి బిడ్డలను సుఖ నిద్రఁ బుచ్చు దల్లులుపాడు జోలపాటల వంటివే. చదివినఁ గాని నిజము తెలియదు. కావున వ్రాసి పుస్తకములఁ దెప్పించు కొనుటయే కర్తవ్యము."

— గృహలక్ష్మి.

వ్యాస కుటీరము

మెలుపాకపోస్టు - ఎలమంచిలి తా॥

( విశాఖపట్నము జి. )

## — సిద్ధముగ నున్నవి —

